విపుల

తెలుగు మాస పత్రికకు
అన్ని గ్రామాలలోనూ, పట్టణాలలోనూ
సమర్థవంతులైన ఏజంట్లు కావాలి!

ఏజన్సీ వివరాలకు
వెంటనే వ్రాయండి.

సర్క్యులేషన్ మేనేజర్
విపుల
9, దేశికా రోడ్డు, మైలాపూరు,
మద్రాసు - 600004.

# విస్డమ్

అంతర్జాతీయ తెలుగు సచిత్ర మాసపత్రిక

సంపాదకవర్గం

సంపాదకుడు:

లయన్ కె.వి.గోవిందరావు బి.ఏ., ఎల్ ఎల్.బి.,

గౌరవ సహాయ సంపాదకులు :

టి.ఎల్.ఎన్.రావు బి.ఎస్సి.,

వి.బాలకుమార్ ఎమ్.ఏ., బి.ఎల్.,

సభ్యులు :

కె.వి.ఎస్. గోవిందరావు బి.ఏ., ఎల్ ఎల్.బి.,

కె.వి.ఎస్. శరత్‌బాబు బి.ఏ., బి.కాం., బి.ఎల్.,

కె.వి.ఎస్. విజయకుమార్

కె. రత్నకుమారి

చందా వివరాలు

అభిమాన జీవిత చందా..రూ॥ 1000/-

జీవిత చందా..........రూ॥ 300/-

3. సంవత్సరాల చందా..రూ॥ 70/-

సంవత్సర చందా........రూ॥ 24/-

ఎయిర్ మెయిల్ (1సం॥) రూ॥ 125/-

సీ మెయిల్ (1సం॥)......రూ॥ 70/-

చందా పంపవలసిన చిరునామా

విస్డమ్

9, దేశికా రోడ్, మైలాపూర్

మద్రాసు-600004


## ఈ సంచికలో

ఏప్రిల్ 1987



★

ముఖ చిత్రం:

స్వామిరామదాసు

**తెలుగు విస్డమ్‌కు ఇది ఆరవ సంవత్సరం**

## ధ్యానం

# ప్రకృతి ధర్మం




''నన్ను ఎవ్వరూ గౌరవించడంలేదు. లక్ష్యం చేయడంలేదు. నన్ను అందరూ ఉపేక్షిస్తున్నారు ఎవ్వరూ లెక్కచేయడం లేదు నేను అంటే అందరికీ చులకన'' అనుకుంటూ బాధపడిపోతావు ఎందుకు? న్యాయం, ధర్మం అంటే ఏమిటో తెలుసుకున్నావా?

స్వాభిమానం మితిమీరిపోతే కళ్ళు మూసుకుపోతాయి. లోకం అడ్డదిడ్డాలుగా కనబడుతుంది. ఆత్మవంచనతో స్వాతిశయంతో బోర్లాపడిపోతావు. మనస్సులో సుడిగుండాలు తిరిగిపోతాయి. పరమ సత్యం, యధార్థతత్వం మరుగుపడిపోతాయి. దోష భూయిష్టమైన నీ తప్పులను చింతించుకుంటూ నిరంతర దుఃఖంతో దిక్కుమాలిన దీనస్థితిలో మునిగిపోతావు. ప్రకృతి స్వరూపం తెలుసుకోకపోవడంవల్ల ఏర్పడే చిక్కది. ఆత్మకు శాంతి లేకుండా నీ

(మిగతా 56 వ పేజీలో)

## సంపాదకుని పేజీ

# సాధనవల్లే పరిపూర్ణత

పరిపూర్ణతలో సౌందర్యం ఉంది. సక్రమమైన దేహపరిశ్రమవల్ల, వ్యాయామంవల్ల సాకల్యత సిద్ధిస్తుంది. వృద్ధాప్యంలోకంటే యౌవ్వనంలో ఉన్నప్పుడు చాలామంది ఎంతో ఆరోగ్యవంతంగా ఉషారుగా, ఉత్సాహంగా ఉండటం సహజం. యౌవ్వనంలో ఉన్నప్పుడు శరీరంలో జవసత్వాలు ఉంటాయి. ఓపిక ఉంటుంది. ఆటపాటలతో అనేక వ్యాసంగాలతో శరీరానికి వ్యాయామం కలిగించేటట్టుగా సదా తీరికలేకుండా ఉంటాం. ముసలితనంలో దేహపరిశ్రమ యొక్క ప్రాముఖ్యతను పూర్తిగా విస్మరిస్తాం. అందువల్ల శరీరం పెరిగిపోతుంది. ఆరోగ్యం చెడిపోతుంది. అనేక రోగాలకు గురిఅవుతాం.

ఈదురోమంటూ ఎప్పుడూ రోగంతో బాధపడేవారు వైద్యుని సంప్రదిస్తే సక్రమంగా వ్యాయామం తీసుకోమంటాడు. బాగా కండలు పెరిగిపోయిన స్థూలకాయులు వైద్యుని కలుసుకుంటే రోజూ వ్యాయామం చేస్తూ ఆహారనియమాలు పాటిస్తూ స్థౌల్యాన్ని తగ్గించుకోమని సలహా ఇస్తాడు.

వ్యాయామం లేక సక్రమ సాధనయొక్క విలువను ఎవ్వరూ కాదనలేరు. వేగంగా పరుగెత్తలేని వృద్ధులు చాలాదూరం ఉషారుగా నడవటం అభ్యాసం చేసుకోవాలి. నడక వారికి ఎంతో మేలుచేస్తుంది.

ఏ కార్య రంగంలోనైనాసరే సాధనవల్లే

''సులభంగా స్వల్ప ప్రయాసతో మోక్షం దొరికితే దానికి మహత్వముండదు.''

పరిపూర్ణత సిద్ధిస్తుంది. ఎవ్వరూ ఒక్కసారిగా సుప్రసిద్ధ సంగీత విద్వాంసులు కాలేరు. ప్రతిరోజూ సాధన చేయగా చేయగా సుశ్రావ్యమైన సంగీతం పాడగలుగుతావు. ఇలాగే వీణ, ఫిడేలు, పియానో నైపుణ్యంగా వాయించాలంటే సాధన చేయాలి. వివిధ క్రీడలలో నైపుణ్యం పొందాలంటే సాధన చేయాలి. సక్రమ సాధనవల్ల సమగ్రత— సాకల్యత సిద్ధిస్తుంది.

వ్యోమగాములు చంద్రలోకంలో ఎదుర్కోవలసిన పరిస్థితులను తట్టుకోడానికి భూమిమీద రకరకాల సాధనలు చేస్తారు.



వ్యోమగాములు ఇక్కడ తెలుసుకున్న పరిజ్ఞానంవల్ల, అనుసరించిన సాధనలవల్ల చంద్ర మండలంలో విజయవంతంగా విహరించగలుగుతారు.

నీలో తెలుసుకోవాలనే కోరిక, సాధించాలనే ఉత్సాహం, ఆనందించాలనే ఉబలాటం చైతన్యవంతం కావాలి. ఈ మూడు సరిసమానంగా నీలో పెంపొందినప్పుడు నీవు చేపట్టిన ప్రతీ పని సర్వతోముఖమైన సమగ్రతతో విరాజిల్లుతుంది.

సాధనవల్ల ఏర్పడే అభ్యాసం జీవితాన్ని సరళవంతం చేస్తుంది. నీవు తింటున్నావు, త్రాగుతున్నావు, నడుస్తున్నావు, సులభంగా పరుగెత్తగలుగుతున్నావు అంటే ఎన్ని సంవత్సరాలు ఎన్ని రోజులు సాధనచేశావో ఆలోచించు.

జాతి కులమతాల ప్రమేయం లేకుండా యోగులు అనంత ఆత్మయొక్క దివ్యానందాన్ని అనుభవించడానికి ఆధ్యాత్మిక సాధన చేయమంటారు. సుఖప్రదమైన ఆనంద దాయకమైన ప్రాపంచిక జీవితానికి సాధన ఎంత అవసరమో మరణానికికూడా సాధన అంత అవసరం. సుఖవంతమైన జీవిత చరమ విశ్లేషణలో హాయిగా మరణించాడు అని వినడానికి ఎంతో ఆనందదాయకంగా ఉంటుంది.

నీటిలో ఈదటం చేతగానివాడు ఒకడు బాగా ఈదగలవానిని సమీపించి "నీటిలో ఈదడానికి నీకు భయంలేదూ?" అని అడిగితే "నేను నీటితో స్నేహం చేసుకున్నాను" అని జవాబు చెప్పాడు. చాలామందికి మరణం అంటే ఎంతో భయం. మరణంతో స్నేహంచేసుకోరు. కాబట్టే మరణం అంటే భయం. మరణాన్ని గురించి అసలు ఆలోచించరు. లైఫ్ ఇన్స్యూరెన్స్ కంపెనీలో జీవిత భీమా చేసుకుంటూ బ్యాంకులో సొమ్ము పెట్టుబడి పెడతాం. ఇవన్నీ ముందు ఆలోచనతో భావి జీవితానికి ప్రణాళిక పరచుకున్నవే. జీవితాన్ని గురించిగానీ, మరణాన్ని గురించిగానీ కొంచెమైనా ఆలోచించావా?

మరణం గురించిగానీ, అనంత జీవితాన్ని గురించిగానీ ధ్యానంచేస్తే జీవితాన్ని సుఖమయం చేసుకోగలుగుతావు. ఈ దివ్య ధ్యానంవల్ల ఇహపరలోకాలు రెంటిలోనూ సుఖపడతావు. జీవన్మరణాల రహస్యాన్ని

(మిగతా 22 వ పేజీలో)

"ఆచారం చెడినప్పుడు ధర్మాచరణ అధర్మాచరణగా మారును."

# సుప్రసిద్ధ వైస్రాయిలు - జీవితవివరాలు

రాఘవేంద్రరావు

ఆంగ్లేయుల పరిపాలనా కాలంలో భారత దేశానికి గవర్నరు జనరల్‌లుగాను వైస్రాయిలుగాను ఉన్న మొత్తం 33 మందిలో వైస్రాయి లిట్టన్ ప్రభువు ఒక్కడే



కర్జన్ ప్రభువు

కవి, సారస్వతాభిలాషి. ఇతడు ప్రభుత్వ కార్యక్రమాలకు సంబంధించిన జాబులను కూడా సాహిత్యధోరణిలో ప్రత్యేక శైలీ విధానంలో సాగించేవాడు.

ఒకసారి ఇతడు ఆనాడు విదేశీ వ్యవహారాల కార్యదర్శి ఆల్‌ఫ్రెడ్ లియాల్‌కు వ్రాయవలసిన ముఖ్యమైన జాబును ఆఫ్ఘనిస్థాన్ రాజకీయ పరిస్థితులతో ప్రారంభించి, ఇటలీ కవి డాంటే వ్రాసిన పుర్గిటోరియా అనే కవితను గురించి 2 పుటలు వివరిస్తూ జాబును సమాప్తం చేసాడు.

కర్జన్ ప్రభువు 39 సం. ల అతి చిన్న వయస్సులో వైస్రాయి పదవిని స్వీకరించాడు. జార్జి నెథేనియల్ కర్జన్ అతి జాగ్రత్తగా అన్ని పనులు తనంతట తానే స్వయంగా నిర్వర్తించుకునేవాడు. అత్యల్ప విషయాలను కూడా ఇతరులకు పురమాయించేవాడు కాదు.

కొంతమంది ఆంగ్లేయ చరిత్రకారులు కర్జన్ ప్రభువుది ఒంటరి ప్రభుత్వం అని హాస్యం చేసారు కూడా. మంచి కార్య దక్షతతోపాటు కర్జన్ గొప్ప సాహిత్యరసికుడు, ప్రకృతి సౌందర్యారాధకుడైన కర్జన్ తన ముగ్గురు కుమార్తెలలో ఒక కుమార్తెకు 'నాల్దెరా' అనే పేరు పెట్టాడు. సిమ్లాకు దగ్గరగా ఇతడు మిక్కిలి అభిలషించిన



ఇర్విన్ ప్రభువు

ప్రదేశం నాల్దెరా.

కర్జన్ ప్రభువు చురుకుగా, చలాకీగా పని చేసుకునే వైస్రాయి అయితే, డఫ్రిన్ ప్రభువు మిక్కిలి బద్ధకస్తుడు. ముఖ్యమైన నిర్ణయాలన్నీ అతడి అంతరంగిక కార్యదర్శి డొనాల్డ్ మెకంజీ వాలెస్ తీసుకునేవాడు. దొంగ దస్కత్తులను ప్రోత్సహిస్తూ, ఉత్త

"జంతుకోటిలో ఆత్మదర్శన సామర్థ్యముగల మనుష్యుడు ఉత్తముడు."

రాల మీద అతడిచే తన సంతకాన్ని కూడా పెట్టించేవాడు.

డఫ్రిన్ ప్రభువులాగే రీడింగ్ ప్రభువు కూడా మిక్కిలి బద్ధకస్తుడు. వాస్తవం చెప్పాలంటే రీడింగ్ ప్రభువు చదవడం తప్ప ఏ పనైనా ఎంతో ఇష్టంగా చేసేవాడు.

ఎప్పుడూ పార్టీలతో, విందులతో, వినోదాలతో, డాన్సులతోనే విలాసవంతంగా కాలం వెళ్ళబుచ్చేవాడు. రీడింగ్ ప్రభువు ఒక్కడే 'జ్యూ' తెగకు చెందినవాడు.

మూర్తీభవించిన "శాంతి" ఇర్విన్ ప్రభువు. కోపం అంటే ఎరుగడు. జన్మలో ఒకే ఒక్కసారి తన పాత హాంబర్గ్ టోపీ



వెల్లింగ్‌డన్ ప్రభువు

ఎక్కడో పోయిందని కోపం తెచ్చుకున్నాడు.

వెల్లింగ్‌డన్ ప్రభువు కూడా డఫ్రిన్ లాగే మిక్కిలి బద్ధకస్తుడు. ముఖ్యమైన పనులన్నీ అతడి భార్యామణి చేసిపెడుతూండేది.

లేడీవిల్లింగ్‌డన్‌కి లేతనీలం ఎరుపు కలిపిన మావ్ (Mauve) రంగు అంటే ఎంతో ఇష్టం. ఆనాడు వైస్రాయి నివసించే భవనానికి (ఇప్పుడు రాష్ట్రపతి భవనం) అంతా పూర్తిగా ఆమెకు ఇష్టమైన ఈమావ్ రంగు వేయించింది.



వేవెల్ ప్రభువు

వేవెల్ ప్రభువు అంగవైకల్యంతో వైస్రాయి పదవిని అధిష్టించాడు. ఇతడికి

## 'విస్‌డమ్' పాతకాపీలు

మార్చి '82; ఫిబ్రవరి '83, మార్చి '83; మార్చి '84 నుంచీ జూన్ '84; ఆగస్ట్ '84 నుంచీ నవంబరు '84; జనవరి '85 నుంచీ అక్టోబరు '85; జనవరి '86 నుంచీ జూన్ '86 కాపీలు మా వద్ద ఉన్నవి. '82 కాపీ వెల. పై 0.75 లు; 1983 కాపీల వెల. రూ. 1-75 లు; 1984 కాపీల వెల రూ. 10-00 లు; 1985 కాపీల వెల రూ. 12-50 లు; 1986 కాపీల వెల రూ. 8.75 లు. రిజిస్టర్డ్ పోస్ట్‌లో పొందడానికి కాపీల వెలతో పాటు రూ. 4-50 చేర్చి M.O. పంపాలి. 'విస్‌డమ్' 9,దేశికారోడ్డు, మద్రాసు-600004.

—సర్క్యులేషన్ మేనేజర్.

"జ్ఞానము, కర్మ, భక్తి అనునవి భగవంతుని పొందుటకు సాధనములు."

బ్రహ్మాండమైన చెముడే కాదు మొదటి ప్రపంచ మహాయుద్ధంలో ఒక కన్ను కూడా పోయింది. ఇతడికి ఒక కన్ను పోయిన సంగతి చాలామందికి తెలియదు.

గ్రుడ్డి కంటికి తగిలించుకున్న గాజు



కన్ను నిజం కన్నులాగే కనిపించేది. దీర్ఘకాలం 7 సంవత్సరాలపాటు పదవిని అధిష్ఠించిన వైస్రాయి లిన్‌లిత్‌గో ప్రభువు



మింటో ప్రభువు

మిక్కిలి పొడవరి. ఆజానుబాహుడు. ఇతడు సంగీతం అంటే చెవికోసుకునేవాడు. పాడుకోవడం అంటే ఇతడికి ఎంతో ఇష్టం. వైస్రాయి భవనం ఎప్పుడూ సంగీతంతో ప్రతిధ్వనిస్తూండేది.

హత్య కావింపబడిన వైస్రాయి లార్డ్ మేయో 1872వ సం. లో అండమానుదీవులకు వెళ్ళినప్పుడు మతి భ్రమణం పొందిన ఒక అఫ్ఘన్ నేరస్థుడు ఇతనిని కత్తితో పొడిచి హత్య చేశాడు. కుక్కకాటుతో బాధపడిన వైస్రాయి మింటో ప్రభువు. సిమ్లాలో ఒక పిచ్చికుక్క ఇతనిని కరచింది. దీర్ఘకాలంపాటు పాశ్చర్ వైద్య చికిత్స



మౌంట్‌బాటన్ ప్రభువు

తీసుకోవలసి వచ్చింది.

చివరగా భారతదేశపు చివరి వైస్రాయి మౌంట్‌బాటన్ ప్రభువు. ఇతడొక్కడే రాజవంశానికి చెందిన వైస్రాయి. విక్టోరియా మహారాణి మునిమనమడు. చక్రవర్తికి దాయాది. లూయిఫ్రాన్సిస్ అల్‌బెర్ట్ విక్టర్ నికోలస్ మౌంట్‌బాటన్‌కి టొమాటోలంటే మహాద్వేషం. టొమాటోల రంగు, రూపం రుచి చూస్తే అసహ్యించుకునేవాడు. పనికిమాలినపళ్ళు ఎలా తింటున్నారో అని అంటూండేవాడు.

"చరిత్ర రాజుల యుద్ధాల కథ కాకూడదు. అది భావాల చరిత్ర కావాలి."

# చరిత్రలోని వెలుగులు

## సోక్రటీస్‌కి కోపంలేదు:

గ్రీసుదేశపు ప్రఖ్యాత తత్త్వశాస్త్రజ్ఞుడైన సోక్రటీస్ అసలు కోప స్వభావమేలేని పరమ శాంత మూర్తి. ఒకనాడు సోక్రటీస్ సతీమణి కోపంతో అనరాని మాటలతో నోటికి వచ్చినట్టు నిందించింది. సోక్రటీస్ చలించలేదు. దీనికి ఆమె మండుతూన్న కొరువులను



ఎగసన దోసినట్టు రెట్టించిన కోపంతో బాల్చీడు నీళ్ళు భర్త నెత్తిమీద గుమ్మరించింది. నిశ్చలమైన మనస్సుతో సోక్రటీస్ "పెద్ద ఉరుములు మెరుపులు తరువాతే వాన జల్లు రావడం సహజం" అని ఊరుకున్నాడు. సోక్రటీస్ అంతటి శాంత స్వభావం కలవాడు కాబట్టే ఆనాటి ప్రజానీకాన్ని అతి సమర్థవంతంగా సంస్కరింప గలిగాడు.

* * *

## చర్చలో తరువాత నీవు ఆశించిన విషయం:

లాయడ్ జార్జి ఒకనాడు పెద్ద సభలో ప్రసంగిస్తున్నాడు. మధ్యలో ఒక డంబాల రాయుడు—ఉపద్రవకారుడు 'చెత్త' అంటూ అడ్డు తగిలాడు. శీఘ్ర యోచనా పరుడైన రాజకీయవేత్త జార్జి వెంటనే "దయచేసి కొంచెం ఆగితే చర్చలో తరువాత నీవు ఆశించిన విషయం తీసుకుంటాం అని జవాబు చెప్పాడు.

* * *

## కడవ క్రింద ముళ్లు పెళ పెళ శబ్దం:

ఒకనాడు పార్లమెంటు సభలో చర్చిల్ ప్రసంగిస్తుంటే ఒక సభ్యుడు పకపకా నవ్వాడు. చర్చిల్ అది గ్రహించి గౌరవనీయుడైన సభ్యుని సంబోధించి "మీ నవ్వు కడవక్రింద ముళ్ళు పెళపెళ మన్నటు ఉంది" అన్నాడు. వెంటనే ఆ సభ్యుడు ఇంటికి పరు



గెత్తి బైబిల్ ఇతర క్రైస్తవ మత గ్రంథాలను తిరగేయగా అందులో "As the crackling of thorns under a pot, so is the laughter of a fool" (మూఢుడైన అవివేకి నవ్వు కడవ క్రింద ముళ్ళు పెళపెళ మన్నట్టు ఉంటుంది) అనే వాక్యం కనిపించింది.

"మనిషికి పెట్టని కోట చదివిన చదువుకాదు; సంపాదించిన వ్యక్తిత్వం.

—స్పెన్సర్

# మీ టీవీ భద్రతకు సూచనలు

శ్రీవీ రిసీవరుని నిలకడలేని ట్రాలీమీదగానీ, బల్లమీదగానీ ఎప్పుడూ పెట్టకూడదు.

ఎక్కువగా వేడెక్కకుండా ఉండడానికి టీ వీ వెనుకప్రక్క గోడకు టీవికి మధ్య బాగా తగినంత గాలి తగిలేటట్టు ఎడం ఉండాలి.

బయట అంటెనా ఓవర్ హెడ్ పవర్ లైనుకు దూరంగా ఉండాలి. అకస్మాత్తుగా ఏ మాత్రం తగిలినా మరణోపాయం సంభవిస్తుంది.



పవర్ కార్డుకు తగిలేటట్టుగా ఏ వస్తువును పెట్టవద్దు. పవర్ కార్డు ఎవరికీ తగలకుండా ఉండేటట్టు అమర్చాలి. ఆన్‌లో ఉన్నప్పుడు టీవీని జరపడానికి ప్రయత్నిస్తే ఏ మాత్రం చిన్న కుదుపువల్లనైనా ప్రమాదం జరుగవచ్చు. రిసీవరు దెబ్బ తింటుంది.

రిసీవరును ఉపయోగించనప్పుడు, టీవీ ఉపయోగంలో లేనప్పుడు, రిసీవరును శుభ్రం చేసేటప్పుడు ప్లగ్‌లోనుంచి కనెక్షను తీసేయాలి.

రిసీవరు ఉండే గదిలో కాంతి అంత ఎక్కువగా ఉండకూడదు. అంత తక్కువగా ఉండకూడదు. మధ్యరకంగా ఉండాలి. గదిలో దీపాలకాంతి సరాసరి కళ్ళల్లో పడేటట్టుగా గానీ, టీవీస్క్రీను మీద పడేటట్టుగా గానీ ఉండకూడదు.

గాలి వాన లేక తుఫాను సమయంలో గానీ, చాలా రోజులు టీవీ వాడనప్పుడుగానీ అంటెనాని డిస్‌కనెక్టు చేయడం చాలా శ్రేయస్కరం. దీనివల్ల మెరుపులు వచ్చినప్పుడు టీవీ చెడిపోకుండా ఉంటుంది.

## అశ్వశాస్త్రం

ఫ్రాన్స్‌లో జోమేరీ డాన్‌బరే అనే అతడు తండ్రిని చంపిన హత్యానేరానికి ఫిబ్రవరి 16, 1746 న ఉరితీయబడ్డాడు. తిరిగి 100 సంవత్సరాలకు అదే రోజున మరో జోమేరీ డాన్‌బరీ అనే యువకుడు అదే నేరానికి ఉరితీయబడ్డాడు. ఈ హంతకుడు మొదటి హంతకుని మనుమడే.

40 సంవత్సరాలపాటు తీవ్ర పరిశోధనలు సలిపి హెన్రీ బ్లేక్ అనే ఆంగ్లేయుడు గుర్రాలు వాటి పెంపకానికి సంబంధించిన నిఘంటువును ఒకదానిని తయారుచేశాడు. ఇది గుర్రాలను పెంచేవారికి, క్రీడాకారులకు చాలా ఉపయోగంగా ఉంటుంది. అశ్వాలు 30 రకాలుగా తమ విశ్వాసాన్ని ప్రదర్శిస్తాయి. (ఇంతకంటే పురాతనమైన, అపూర్వమైన అశ్వశాస్త్రం అనే గ్రంథాలు వివిధ చిత్రాలతో సంస్కృతంలో వ్రాతప్రతులు మదరాసు ఓరియెంటల్ మాన్యుస్క్రిప్ట్స్ లైబ్రరీల ను తంజావూరు సరస్వతీ మహల్ లైబ్రరీలోను ఉన్నాయి.)

"లోకజ్ఞానం మితిమీరిపోతే
వివేకమనిపించుకుంటుంది."

# నవభారత నిర్మాతలు

## సరోజినీ నాయుడు

యు. సుబ్రమణీయం

భారతదేశపు ప్రఖ్యాత మహిళలలో ప్రజల ఆదరాభిమానాలను పొంది అఖండ కీర్తి ప్రతిష్ఠలను గడించిన నారీరత్నం శ్రీమతి కె. సరోజినినాయుడు. సర్వమత సామరస్యాన్ని పెంపొందించే సామ్యవాదంతో జాతీయ సమైక్యతకు జీవితాన్ని అంకితం చేసిన మహిళామణి.

వంగదేశపు పుణ్యదంపతులకు పుట్టిన ఈమె అమూల్య జీవితం ఆంధ్రప్రదేశ్ (నాడు నైజామ్ పాలనక్రింద హైదరాబాదు) కే అంకి



తమైపోవడం దైవఘటన. హైదరాబాద్ లో నివసిస్తూన్న ఒక మధ్య తరగతి వంగ కుటుంబంలో 1879వ సం.రం ఫిబ్రవరి 13వ తేదీన జన్మించింది. ఈమె అఘోరనాథ్ చటోపాధ్యాయ, వరదాసుందరి దంపతుల 8 మంది సంతానంలో జ్యేష్ఠురాలు. తండ్రి గొప్ప విద్వాంసుడు. ఆనాడు ఉమ్మడి హైదరాబాద్ రాష్ట్రంలో మత వివక్షతలేని కుటుంబం వీరిది. సరోజినిది ఉత్తరదేశా బంగాళం)నికి చెందిన బ్రాహ్మణకుటుంబం. ఈమె ఒక దక్షిణాది గోవిందరాజులు నాయుడుని వివాహం చేసు కుంది.

సరోజిని బాల్యంలోనే కవిత్వమంద గొప్ప అభిరుచిని ప్రదర్శించింది. ఈమె తన 13 సం.రం వయస్సులో 'లేడీ అఫ్ ది లేక్' (Lady of the lake) అనే పద్యాన్ని ఆంగ్లంలో రచించింది. పాఠశాలలో అపూర్వ ప్రజ్ఞావంతురాలు అనిపించుకుని 12వ సం. రంలోనే మద్రాసు రాజధాని మెట్రిక్యు లేషన్ పరీక్షలో ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణ రాలైంది. పైచదువులకు ఇంగ్లండ కేంబ్రిడ్జికి పంపబడింది. విదేశంలో ఆంగ్లేయ గ్రామీణ వాతావరణానికి ముగ్ధురాలై ఆంగ్లంలో అనేక కావ్యాలను రచించింది. ఆనాడు సుప్రసిద్ధ విమర్శకుడు ఎడ్మండ్ గాస్సే ఈమెకు మాతృదేశాన్ని గూర్చి కావ్యాలను వ్రాయమని ఉత్సాహాన్ని కలి గించాడు. నాటినుండి ఆమె 'ది గోల్డెన్ థ్రెషోల్డ్' (1905) "ది బర్డ్ అఫ్ టైమ్" (1912), "ది బ్రోకెన్ వింగ్" (1917 మొదలైన అద్భుత ఆంగ్ల కావ్యాలను రచిం చింది. ఈమె వాక్చాతుర్యానికి, ప్రసంగాలకు సమ్మోహితులు కానివారు లేరు. జవహర్ లాల్ నెహ్రూ, సుభాష్ చంద్రబోస్ ప్రభృ తులు ఈమె వాగ్ధాటికి ముగ్ధులయారు.

1903 వ సం.లో ఈమె దేశీయకార కలాపాలలోకి దిగింది. ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ బొంబాయి సెషన్‌

---

"దేశాభిమానం లేని మానవుని
హృదయం ప్రేమరహితమైన శూన్య హృదయం.
—బైరన్

'టు ఇండియా' అనే జాతీయ గీతాన్ని చదివి సభ్యులను ముగ్ధుల్ని చేసింది. ప్రప్రథమంగా ఈమె గోపాలకృష్ణ గోఖలే, మహమ్మద్ ఆలీ జిన్నా మున్నగువారితో చేరి దేశసేవకు పూనుకుంది. అనిబిసెంట్ పిలుపును అందుకుని 1916 వ సం.లో హోమ్ రూల్ సభ్యురాలుగా మారింది. తొలిసారి ఈమె 1914 వ సం.లో మహాత్మా గాంధీని దర్శించి ఆతడి నిరాడంబర జీవితానికి, సత్యసంధతకు, దేశ స్వాతంత్ర్య లక్ష్య సిద్ధికి చకితురాలై గాంధీజీని భక్తిశ్రద్ధలతో అనుసరించింది.

ఆఫ్రికాలో ఇండియనుల సేవకై 1924వ సం.లో ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ ఈమెను తూర్పు, దక్షిణ ఆఫ్రికాలకు పంపింది. అక్కడ వారికి ధైర్యోత్సాహాలను కల్పించి, హక్కులకు పోరాడాలనే చైతన్యాన్ని వారిలో సృష్టించింది.

1925 వ సం.లో ఈమె గాంధీనుండి ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ అధ్యక్ష పదవిని స్వీకరించింది. ఉపన్యాసాలలో ఈమె ప్రదర్శించే మానవీయత, హాస్య ధోరణి అందరి మెప్పును పొందింది.

మిస్‌మేయో రచించిన 'మదర్ ఇండియా' వల్ల మాతృదేశానికి కలిగిన అగౌరవాన్ని రూపుమాపడానికి గాంధీజీ ఈమెను అమెరికాకు పంపాడు. ఈమె వాక్చాతుర్యాన్ని, ప్రసంగ ధోరణిని అమెరికనులు మెచ్చుకున్నారు. 1930 ఉప్పుసత్యాగ్రహంలో గాంధీజీ దండి (గుజరాత్) లో అరెస్టుచేయబడినప్పుడు ఈమె ధైర్యసాహసాలతో ఉప్పుసత్యాగ్రహం ఉద్యమాన్ని చేపట్టింది.

1942 వ సం.లో క్విట్ ఇండియా ఉద్యమంలో సరోజినిని అరెస్టుచేసి పూనాలో అగాఖాన్ పాలెస్‌లో గాంధీజీతోపాటు నిర్బంధించారు.

దేశ స్వాతంత్ర్యానికై సలిపిన పోరాటంలో ఈమె అనేకసార్లు అరెస్టు చేయబడింది. చెరసాలలో అనేక కష్టాలను అనుభవించింది. హిందూ మహమ్మదీయ సమైక్యత ఈమెను ఆకర్షించిన మరో ముఖ్య సమస్య.

ప్రముఖ కవి, గొప్ప రచయిత హరీంద్రనాథ్ చటోపాధ్యాయ ఈమె సోదరుడు. పశ్చిమ బెంగాల్ మాజీ గవర్నరు పద్మజా నాయుడు ఈమె కుమార్తె.

అనారోగ్య పరిస్థితులలో కూడా ఈమె దేశసేవకై తన జీవితాన్ని ధారపోసింది. 1947 వ సం.లో దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించినప్పుడు తిరిగి ఈమె ఉత్తరప్రదేశ్ గవర్నరుగా నియమితురాలైంది. మార్చి 2, 1949 న ఇంకా గవర్నరు పదవిలో ఉంటూండగానే 70 వ సం. రం వయస్సులో ఈమె మరణించింది. భారతదేశ చరిత్రలో ప్రముఖ స్థానాన్ని పొందిన దేశాభిమాని, చిరస్మరణీయురాలు సరోజినీనాయుడు.

## భారతదేశంలో సగటు జాతీయ ఎత్తు

భారతదేశంలో సగటు జాతియ ఎత్తు 162.1 సెం.మీ.లు. మేఘాలయాలో గారో, కాశీ, జెయిన్‌టియా పర్వత ప్రదేశాలలో నివసించే కొండజాతుల వారు మిక్కిలి పొట్టిగా ఉంటారు. వీరి సరాసరి ఎత్తు 157 సెం. మీలు. పంజాబు, హర్యానా, రాజస్థాన్‌లో నివసించేవారు మిక్కిలి పొడవరులు. వీరి సగటు ఎత్తు 168.4 సెం.మీలు.

"ప్రతీ ధర్మము పవిత్రమైనదే, ధర్మముపట్ల శ్రద్ధ వహించడం భగవదారాధన."

—స్వామి వివేకానంద

# చిరుతపులి - మిక్కిలి వేగవంతమైన జంతువు

రూపాల్ రావల్

భూమిమీద నివసించే జంతువులలో మిక్కిలి వేగవంతమైన జంతువు చిరుతపులి ఇది అతివేగంగా గంటకు 80 కి. మీ. వేగంతో పరుగెత్తుతుంది. ఒక్కొక్కప్పుడు గంటకు 110 కి.మీ.ల వేగంతో 360 మీ. దూరందాకా పరుగెత్తగలదు.

అద్భుతమైన ఈ వేగంవల్ల చిరుతపులి అతి నైపుణ్యంగా వేటాడగలదు. తన ఎరను పట్టుకోడానికి చిరుతపులి ముఖ్యంగా తన



వేగంమీదే ఆధారపడి ఉంటుంది. గుంపులో నుంచి చెదిరిపోయిన జంతువునే ఎరగా ఎన్నుకుంటుంది. జంతువుమీదికి ఒక్కసారి దుమికి ఎరను పట్టుకోదు. బయట వెంటాడి తరిమి పట్టుకుంటుంది. అతి వేగంగా పరుగెత్తి కొద్ది దూరంలో ఆహారాన్ని పట్టుకుంటుంది. ఎరను చంపిన వెంటనే రక్తాన్ని పూర్తిగా పీల్చివేసి గుండె, మూత్రపిండాలను ముందుగా తింటుంది. ఆ తరువాత తల భాగాన్ని తిని ఇతర కండరాలను తింటుంది. ఒకసారి ఆహారం తిన్న తరువాత చిరుతపులి తిరిగి ఎరను వెంటనే ఆశించదు.

చిన్నతల, సన్నని నిడుపాటి రొమ్ము, పొడవైన శరీరం, బలిష్టమైన నిడుపాటి కాళ్ళుగల చిరుతపులిని ఇతర ఈ జాతి జంతువులనుండి సులభంగా తెలుసుకోవచ్చు. దీని గోళ్ళు మొద్దుబారి ఉంటాయి. ఇతర జంతువులకు ఉన్నట్టుగా వంగి ఉండవు. వేగంగా పరుగెత్తుతూ అకస్మాత్తుగా ఆగడానికి ఈ గోళ్ళు దీనికి సహకరిస్తాయి.

దీని కోరలు పులి, పాంథర్ కోరలంత వాడిగా ఉండవు. కుక్కకు ఉండే లక్షణాలు చాలామటుకు దీనియందు కనిపిస్తాయి. చిరుతపులి కాళ్ళు కుక్క కాళ్ళను పోలి ఉంటాయి. చిరుతపులులు సాధారణంగా ఒంటరిగా జీవించినా అప్పుడప్పుడు ఇవి జతలు జతలుగా వేటాడతాయి. ఒకప్పుడు చిరుతపులి భారతదేశంనుంచి ఆఫ్రికాఉత్తరం

(మిగతా 12 వ పేజీలో

## ప్రపంచంలో మిక్కిలి చిన్న గాలిపటం

వీఫాంగ్ అంతర్జాతీయ గాలిపటాల సంబరంలో వీఫాంగ్ థర్డ్ టెక్స్టైల్ ఫ్యాక్టరీలో పనిచేసే జినాన్ (చైనాకు) కు చెందిన 57 సం. ల వయస్సుగల టాంగ్ యాన్‌షో అందరికీ అభిమాన పాత్రుడయాడు. సూక్ష్మదర్శిని సహాయంతో టాంగ్ మంచి మంచి రంగులతో ప్రకాశించే మిక్కిలి చిన్న గాలిపటాలను స్వాలో పక్షుల రూపంలో తయారుచేసి, చిన్న అగ్గిపెట్టెలో పెట్టి ప్రదర్శించాడు. ప్రపంచంలో మిక్కిలి చిన్న గాలిపటం ఇతడే తయారు చేసాడు.

"నీతి గలవానికి నిందభయము లేదు."

# ఈ శతాబ్దంలో సాధించిన సాధనలు

1903 మొట్టమొదటి పూర్తి ఆటోమాటిక్ బాటిల్ తయారీ యంత్రం.

1904 స్టెయిన్‌లెస్ మరియు హైస్పీడు స్టీలు అభివృద్ధి కావింపబడ్డాయి.

1905 అల్‌బర్ట్ ఐన్‌స్టైన్ తన ప్రత్యేక సాపేక్ష సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు.

1907 నిరంతరంగా గాసొలైన్ మరియు



పెట్రోలు ఉత్పత్తికి టవర్ రిఫైనరులు ఏర్పాటు కాబడ్డాయి.

1909 బేకిలైట్‌తో ప్లాస్టిక్ యుగం ప్రారంభమైంది.

1910 ఫ్యాక్టరీ పొగగొట్టాల ద్వారా వాతావరణంలో చేరే కాలుష్యాలు మొట్టమొదట ఎలక్ట్రోస్టాటిక్ ప్రెసిపిటేటర్లతో తగ్గింపబడ్డాయి.

1913 నిరంతర విధాన యాంత్రిక సాధనాలతో ఉత్తమ తరగతి షీట్‌గ్లాస్ ఉత్పాదన ప్రారంభమైంది.

1920 పెరిగిపోతూన్న విద్యుచ్ఛక్తి గిరాకీని తట్టుకోడానికి హైవోల్టేజి విద్యుచ్ఛక్తి ప్రారంభింపబడింది.

1930 హూవర్ మరియు ఇతర పెద్ద పెద్ద డాముల నిర్మాణం జరిగింది. భూమి ఉష్ణశక్తితోను, మరియు సౌరశక్తితోను విద్యుజ్జనక సాధనాలు, గ్యాస్ టర్బైనులు ఏర్పాటు కాబడ్డాయి.

1931 1248 అడుగుల ఎత్తైన ఎంపైర్ స్టేట్ భవన నిర్మాణం పూర్తి కాబడింది.

1947 తీరప్రదేశాలలో నూనెకు త్రవ్వకాలు తీవ్రంగా ప్రారంభమయ్యాయి.

1970 తీరాంతర ప్రదేశాలలో నూనె త్రవ్వకాలు తీవ్రంగా అభివృద్ధి పొందింపబడ్డాయి. అనేక దశలలో విద్యుచ్ఛక్తికి అణుశక్తి ఆధారంగా పరిణమించింది.

1980 విప్లవాత్మక వస్తు తయారీలో దిట్టమైన క్రొత్త ప్లాస్టిక్‌లు, పింగాణీలు ప్రవేశపెట్టబడ్డాయి.

(11 వ పేజీ తరువాయి)

వైపు ప్రవేశించి దక్షిణ ఆఫ్రికాలో చేరుకుంది. ఈనాడు ఇది ఆఫ్రికాలో మాత్రమే కనిపిస్తుంది. ఆసియాలో వ్యవసాయం విస్తరించుకుపోవడంవల్ల లేళ్ళు, దుప్పులు వంటి ఆహారం దొరకకపోవడంవల్ల, సహజ వాతావరణం లేకపోవడంవల్ల వీటి సంఖ్య తగ్గిపోయింది. ఎక్కువగా చిరుతపులుల చర్మంతో చేసిన కోట్లకు, రగ్గులకు ఉండే గిరాకీవల్ల ఇవి విస్తారంగా చంపబడుతున్నాయి. (సిఇఇ-ఎన్.ఎఫ్.ఎస్.)

"కొరువులు కదిలిస్తే అగ్గి భగ్గున మండుతుంది. పొడిస్తే పాము పడగ విప్పుతుంది. కలవరం కలిగిస్తే మానవుడు స్వస్వభావాన్ని చిక్కబట్టుకుంటాడు." —కాళిదాసు

# ప్రపంచవార్తలు

## ఎలుకలు నాశనం చేస్తున్న ప్రపంచపు ధాన్యపు పంట:

యునైటెడ్ నేషన్స్‌వారి అంచనా ప్రకారం సాలీనా 20 శాతం ధాన్యపు పంట, 42 మిలియను టన్నుల ఇతర ఆహార వస్తువులు ఎలుకలు తినేస్తున్నాయి. వాటిని చంపడానికి ఎన్నిరకాల మందులు పెట్టినా ఎలుకలు వాటిని పసిగట్టి అతి సామర్థ్యంగా తప్పించుకోగలుగుతున్నాయి.



* * *

## ప్రపంచంలో అతి శక్తివంతమైన ఖగోళ దూరదర్శిని:

ఖగోళ శాస్త్రజ్ఞులు అంతరిక్షంలో ఇప్పుడు చూచే దూరంకన్నా రెండు రెట్లు ఎక్కువ దూరంగా పరిశీలించగల అధిక శక్తివంతమైన దూరదర్శినిని హవాయ్‌లో డబ్ల్యు. ఎమ్. కెక్ అబ్జర్వేటరీలో స్థాపించ దలచుకున్నారు. ఇది ప్రపంచంలో అన్నిటి కంటే మిక్కిలి అధిక శక్తివంతమైన దూరదర్శిని కాగలదు. దీనిలో అమర్చబడిన 1,016 సెంటీమీటరు మొజెయిక్ దర్పణం ద్వారా దూరంగా ఏర్పడిన ప్రతిబింబాల నుండి వచ్చే కాంతికిరణాలను దూరదర్శిని పెద్దవి చేసి చూపిస్తుంది. శాస్త్రజ్ఞులు వీటిని పరిశీలించవచ్చు. లేక వీటికి ఛాయాచిత్రాలను తీయవచ్చు.

* * *

## సముద్రపు నీటి నుంచి యురేనియం:

ప్రపంచంలో ప్రప్రథమంగా సముద్రపు నీటి నుంచి యురేనియం ధాతువును తీయడానికి జపాను యంత్ర నిర్మాణాన్ని పూర్తి చేసింది. దీని సహాయంతో సంవత్సరానికి 10 కి గ్రా.ల యురేనియం పొందవచ్చు.

* * *

## "శిలానగర" శిథిలాలలో పదిలపరచిన చేపలు:

ఈజిప్టులో కెయిరోకు చేరువగా కృత్రిమ గ్రహ వార్తాప్రసార ముఖ్య కేంద్రం (Satellite communications center) పరిసరాలలోని శిలానగర శిథిలాలలో అతి పదిలంగా భద్రపరచబడిన చేపలను కనుగొన్నారు. దీనివల్ల రాతియుగంలో మానవు

"మానవుని పొట్టపోసుకునే నిత్యజీవిత విధానమే ప్రపంచ చరిత."

— హెన్‌డ్రిక్‌వాన్ వాన్‌ఢర్ బిల్

ంకు మరణించిన ప్రాణుల శరీరాలను భద్ర పరచే విధానం తెలిసి ఉండాలని నిర్ణయించ టానికి వీలవుతుంది. రాతియుగానికి తరు వాత ఐదువందల సంవత్సరాలకు ఫా రో వ్ (pharaos) ఈ ఆచారాన్ని అభివృద్ధి చేశారు.

## గురుగ్రహంలో

గురుగ్రహానికి చెందిన పెద్ద ఉపగ్రహా లలో సూక్ష్మజీవులు ఉండవచ్చు అనే అభి ప్రాయాన్ని సోవియెట్ యూనియన్ శాస్త్ర జ్ఞులు తెలియజేశారు. ఈ ఉపగ్రహాల పైటి ఉపరితలం ఉష్ణోగ్రత, పీడనశక్తి భూగ్రహంమీది సముద్ర గర్భంలో ఉష్ణో గ్రత పీడనలకు సమంగా ఉంటుందని, ప్రాణవాయువు అవసరంలేని సూక్ష్మజీవుల వంటి ప్రోటోజోవా అభివృద్ధికి ఇవి దోహద కారులని అంటున్నారు.

* * *

## ప్రపంచంలో 824 మిలియను ప్రౌఢ నిరక్షరాస్యులు:

యునెస్కో రిపోర్టు ప్రకారం ప్రపం చంలో 824 మిలియను ప్రౌఢులు అక్షర జ్ఞానం లేనివారు. 70 శాతం నిరక్షరాస్యులు ఆఫ్రికాలోని పేద దేశాలలో ఉన్నవారే.

* * *

## అనేక సూర్యులు:

బ్రిటిషు శాస్త్రజ్ఞులు క్రొత్త సూర్యగ్రహా లను కనుగొన్నారు. మనం చూస్తూన్న పాల పుంత (Galaxy) లో కనిపించే చీకటి మబ్బులలో సూర్యునివంటి ప్రకాశవంతమైన నక్షత్రాలు 6 మొదలు 7 వరకు పుట్టుక వస్తున్నాయి. అమెరికాశాస్త్రజ్ఞులు అంతరిక్ష పరిశోధనకు ఆకాశంలోకి వదలిన 'IRAS' ఇన్‌ఫ్రారెడ్ ఉపగ్రహం సహాయంతో ఇవి కనుగొనబడ్డాయి. ఈ నూతన సూర్య గ్రహాలు 1 మిలియను సంవత్సరాల క్రితం ఏర్పడి ఉండాలి. ఖగోళ శాస్త్రజ్ఞుల అభి ప్రాయం ప్రకారం ఇవి 4.6 బిలియను సంవత్సరాలకు పూర్వం సూర్యుడు ఉన్నట్టే ఉండి ఉండాలని అంటున్నారు. ఈ సూర్య గ్రహాలు ప్రాచీన సూర్యుడిలాగ ఉన్నాయి కాబట్టి వాటి చుట్టూ ఇతర గ్రహాలు ఏర్పడే అవకాశం ఉంటుంది అంటున్నారు.

* * *

## బొగ్గుగా మారిన 3,000 సం.ల నాటి గోధుమ:

ఈజిప్టు ఇస్మాయిలియాలో ప్రాచీన గాదె లలో బొగ్గుగా మారిన 3,000 సం. లకు ముందున్న గోధుమ, జొన్న, చిక్కుడు మొదలగువాటిని భూగర్భ శాస్త్రజ్ఞులు కను గొన్నారు.

## భారతదేశంలో 'నికెల్'

భారతదేశంలో 'నికెల్' లోహం ఉత్పా దనకు వీలైన గనులు ఒరిస్సా కటక్ జిల్లాలో సుకిన్డా లోయలో ఉన్నాయి.

"మహాత్ముల హృదయాలు వజ్రాల కంటే కఠినంగా ఉంటాయి.
పువ్వుల కంటే సుకుమారంగా ఉంటాయి."
—లెనిన్

# కాలనిర్వహణ

విల్లు ఎక్కుపెట్టి విడిచిన బాణంలాగా కాలం ఎప్పుడూ ఒకే దిక్కుగా ముందుకే సాగిపోతూంటుంది. కాలం వెనుదిరగదు.

ఒక వార్తాపత్రిక "లాస్ట్ అండ్ ఫౌండ్" ప్రకటనలో ఈ భావాన్నే ఎంతో చక్కగా ప్రచురించింది.

"ఈ రోజు సూర్యోదయం సూర్యాస్తమయం మధ్య జారిపోయింది. రెండు గంటల బంగారు సమయం ప్రతీదానికి వజ్రాలవంటి



60 నిమిషాలు. కనుగొన్న వారికి బహుమానం లేదు.

పోయినది పోయినట్టే" విలువైన వస్తువులు, అమూల్యమైన సొమ్ము మొదలైన వాటిని బహు జాగ్రత్తగా పదిలపరచుకుంటారు. చివరికి ఫ్యాక్టరీలలోను, కార్ఖానాలలోను పనిచేసే వారి శక్తి నైపుణ్యాలను కూడా ఎంతో నైపుణ్యంగా శిక్షణా సామర్థ్యంతో, మానవతా సంబంధాలతో కాపాడుకుంటారు. కాని చాలామంది అమూల్యమైన కాలంయొక్క ప్రాముఖ్యతను గ్రహించలేరు. దీనికి రెండు ముఖ్య లక్షణాలు ఉన్నాయి. మొదటిది గతించిన కాలం గతించి పోయినట్లే. దాన్ని తిరిగి సేకరించుకుని చేర్చుకోలేం. సొమ్ము పోతే పోయిన దానికి ఎన్నో రెట్లు అప్పు తెచ్చుకోవచ్చు. వస్తుసామగ్రులు పోతే కొత్త వాటిని తెచ్చి పెట్టుకోవచ్చు. శిక్షణ పొందిన సిబ్బంది రాజీనామా యిచ్చి వెళ్ళిపోతే క్రొత్తవారిని నియమించుకోవచ్చు. కాలంపోతే తిరిగి తెచ్చుకోలేం. అసాధ్యం, వెళ్ళిపోయిన కాలాన్ని తిరిగి తెచ్చి కూడ పెట్టుకోలేం.

కాలం యొక్క రెండవ ముఖ్యలక్షణం. దీన్ని ఫిరాయించుకోలేం. ఇతర విషయాలలో దేనినైనా అతి సులభంగా ఫిరాయించుకోవచ్చు. కాలచక్రాన్ని గడియారంలాగ వెనుకకు ఎవరైనా త్రిప్పగలరా? తరిగిపోయిన ధనం తిరిగి కూడబెట్టుకోవచ్చు, కాని జరిగిపోయిన క్షణం తిరిగిరాదు.

కాలనిర్వహణ విధానంలో కాలంయొక్క విలువను గ్రహించి వినియోగించుకోడం ముఖ్యం. (-ఎమ్. ఆర్. పాయ్)

## పాఠకుల అభిప్రాయాలు

"సృష్టిలోనే ఉంది చీకటి వెలుగుల
కలయిక
చీకటి లేనిదే వెలుతురు యొక్క
ప్రభావం తెలియదు."
—గొడవర్తి లీలారాణి, చీరాల.

* * *

"దీపాలెన్నైనా దివ్యకాంతి ఒక్కటే,
దేహాలెన్నైనా దేవదేవు డొక్కడే."
—పట్నాయకుని మోహన్‌దాస్,
కొత్తూరు.

"ఎంత పెద్ద వృక్షమైనా గొడ్డలికి లోకువే."

# ఔషధ ప్రపంచం

## 'ఫ్లూ' జ్వరానికి వాక్సిన్ అంతరిక్ష కేంద్రంలో తయారైంది:

సోవియెట్ శాస్త్రజ్ఞులు సాల్యూట్ 7 అంతరిక్ష నౌకలో ఫ్లూ జ్వరానికి సంబంధించిన సూక్ష్మజీవుల నుండి ఫ్లూ జ్వరానికి



టీకామందును తయారు చేసారు. అంతరిక్షంలో భారరహిత పరిసరాలలో సూక్ష్మజీవ సంబంధమైన టీకా మందులను దోషరహితంగా తయారు చేయవచ్చని వీరు అంటున్నారు.

## ముదిరిన లివరు క్యాన్సరుకి అమోఘమైన చికిత్స:

అమెరికా బాల్టిమోర్‌లోని జాన్స్ హాప్కిన్స్ యూనివర్శిటీకి చెందిన పరిశోధక బృందం బాగా ముదిరిపోయిన లివర్ క్యాన్సర్ వ్యాధికి ప్రప్రథమంగా అమోఘమైన చికిత్సను కనుగొన్నట్టు వివరిస్తున్నారు. క్యాన్సర్ కణాలకు బంధింపబడి ఉండే ఆంటీ బాడీస్ ప్రోటీనులకు రేడియో ఆక్టివ్ ఐసోటోప్ చికిత్సవల్ల క్యాన్సరు కంతి ముడుచుకుపోతుంది. 104 మంది రోగుల మీద పరిశోధన చేయగా సగానికి సగం మందికి క్యాన్సరు కంతి 30 శాతం ముడుచుకు పోయింది.

* * *

## ప్రేగులలో వ్రణములకు అజీర్ణ రోగాలకు క్రొత్త ఔషధం:

సోఫియా (బల్గేరియా) లో వైద్య శాస్త్రజ్ఞులు మూలికా సంబంధమైన క్షారములతో వెర్బాస్కాన్ (verbaskan) అనే క్రొత్త మందును మాత్రల రూపంలో తయారు చేసారు. ఈ మాత్రలు ముఖ్యంగా గాస్ట్రైటిస్ వంటి అజీర్ణ రోగాలకు, ప్రేగులలో వ్రణములకు అమోఘంగా ఉపకరిస్తుంది.

* * *

## అనువైన కృత్రిమ శ్వాసకోశం:

జపాన్ టోకియోలో వైద్య పరిశోధకులు ప్రస్తుతం తయారయ్యే కృత్రిమ శ్వాసకోశాల నమూనాలో 10వ వంతు పరిమాణంలో అనువుగా ఉండే చిన్న కృత్రిమ శ్వాసకోశాన్ని రూపొందించారు. దీనిని హృదయానికి సంబంధించిన శస్త్రచికిత్సలలో సౌలభ్యంగా వాడవచ్చు. శ్వాసరోగులు కూడా దీనిని ఉపయోగించవచ్చు. సాంప్రదాయక విధానంలో వాడుతున్న పంపు పరికరం దీనికి అవసరంలేదు.

"కష్టపడుటయె నరకము.
ఇబ్బంది పడకుండుటయే స్వర్గము."

# సమయాన్ని సద్వినియోగం చేసుకో

దేవిడ్ గున్‌స్టన్

ప్రాణికోటిలో మానవజన్మ సర్వోత్కృష్ట మైనది. ఈ సర్వోత్కృష్టమైన మానవ జీవితం యొక్క రహస్యాన్ని తెలుసుకో డానికిగానీ, ఫలితార్థాన్ని తెలుసుకోడానికి గానీ, జీవితంలో కలిగే మహాద్భుతాలను తెలుసుకుని మహాత్ముల జీవితాలను పరిశీ లించి పరిశోధించడానికి గానీ కాలాన్ని సద్వినియోగం చేసుకోని జీవితాలు నిరర్థ కాలు. అటువంటి జీవితం సార్థక జీవితం



అనిపించుకోదు. అదొక వ్యర్థజీవితం మాత్రమే.

మంచి పనికి సమయాన్ని సద్విని యోగం చేసుకో: సార్థక జీవితం యొక్క ఫలితార్థమే విజయం. సకృత్తుగా అదృష్టం కలుగవచ్చు. కానీ ఎవ్వరూ ఈ అదృష్టం మీదే ఆధారపడి ఉండలేరు. కార్యదీక్షతో కూడిన నిరంతర కృషి ఒక్కటే విజ యానికి రాజమార్గం. ఇది తప్ప విజయానికి దగ్గరి త్రోవలు లేవు. కార్యనిరతితోపాటు వివేకం, వివేకంతోపాటు సక్రమయోజన వల్ల పొందే ఫలితాలు అదృష్టంతోగానీ, ఆశతోగానీ లభించవు.

క్రీడాభిరతిని పెంచుకోడానికి సమ యాన్ని సద్వినియోగం చేసుకో: యౌవ్వనం నిలబెట్టుకోడాని కిదే కిటుకు: వివేకంతో యోజనలు చేసుకుంటూ కార్యనిరతితో కృషి చేసేవారే మంచి క్రీడా కారులు. ఆటగాళ్ళకంటే మంచి ఆరోగ్య వంతులు లేరు. ఆటగాళ్ళకంటే ఆదర్శ వంతులు లేరు. నిత్యజీవితంలో క్రీడలపాత్ర ఎంతో ముఖ్యం. మంచి దేహంలో మంచి మనసు కలవాడే మంచి మనిషి. అటువంటి వారి జీవితం క్రీడాభిరామం.

స్వప్నసౌధాల నిర్మాణానికి సమయం సద్వినియోగం చేసుకో: ఇదే అద్భుతమైన అంతరిక్ష యాత్రకు మార్గం: స్వప్నసౌధాలు నిర్మించుకోకుండ తాపత్రయాలతో పొట్టపోసుకోడానికి సంపా దించుకుంటూ సంసార బాధ్యతలను నిర్వ హించుకునే జీవితం ఒక జీవితమా? మా వుడు ఎప్పుడూ స్వప్నాలను కంటూనే ఉంటాడు. అందుకే ఈనాటి మానవుడు కొండ గుహల్లోంచి బయటకు రాగలిగాడు

**1820 వ సం. లో అచ్చయిన తెలుగు పుస్తకం**

పుదూరి సీతరామశాస్త్రిగారి 'పెద్దబాలశిక్ష 1820 వ సం. లో అచ్చయింది.

"ఆశ లేనివాని కగచాట్లు లేవు."

పట్టి గుడిసెలను వదిలి ఆకాశ హర్మ్య లలో నివసించగలుగుతున్నాడు.

నవ్వడానికి సమయం వినియోగించుకో. ఇదే అంతరంగానికి ఆటవిడుపు: ఆధునిక వైద్యశాస్త్రం, ఆధునిక విజ్ఞానం ఎంత ప్రగతి పొందినా అందరికీ అన్ని రోగాలకూ అమృతౌషధం నవ్వు. హాస్యం ఎంతో ఆరోగ్యాన్ని కలిగిస్తుంది. నరాల బిగువు సడలిస్తుంది. నాడీమండలం చైతన్య వంతం అయిపోతుంది సమస్యలు తీరి పోతాయి. నవ్వితే నీతో లోకమంతా నవ్వు తుంది. జీవితం ఆనందధామం అయి పోతుంది.



స్నేహాభివృద్ధికి సమయం వినియోగించుకో సంతోషసామ్రాజ్యానికి సజావైన బాటిది: ఒకరి నొకరు నిందించుకోడం కాదు. పరస్పరానురాగంతో సౌభ్రాతృత్వాన్ని పెంచుతుంది స్నేహం. జీవితంలో సత్సాంగత్యం చేయనిది ఏముంది? బుద్ధి జాడ్యాన్ని పోగొడుతుంది. సత్యవాక్కును కలిగిస్తుంది. గౌరవాన్ని కలిగిస్తుంది. మంచి వాక్కును కలిగిస్తుంది. మనస్సును నిష్కళంకం చేసి కీర్తిని నాలుగు దిక్కులా విసరింపజేసుంది.

ఖావి సమయాన్ని సద్వినియోగం చేసుకో. వివేకానికిదే పునాది వివేకం ఊరికే వృద్ధి పొందదు. జ్ఞానం దానంతటది పెరగదు. సద్గ్రంథాలను అధ్యయనం చేస్తూ వివేకం, విజ్ఞానం రెంటినీ పెంచుకో గ్రంథ పఠనంవల్ల మనస్సులో వెలిగే జ్ఞానజ్యోతి జీవితాంతం తేజోవంతంగా ప్రకాశిస్తుంది చదువుకోడానికి సమయం సద్వినియోగం చేసికోనివారు బుద్ధిజాడ్య జనితోన్మాదులు.

ప్రకృతిని పరిశీలించడానికి సమయాన్ని సద్వినియోగం చేసుకో 'నేను, నాది' అనే దురహంకారం పోగొట్టుకోడానికి ఇదే సులభ మార్గం నీ వాక్కు డివేనా లోకంలో నీ కంటే దుర వస్థలలో ఉండేవారు ఎంతోమంది. వారందరికి చేతనైనంత సహాయానికి పూనుకో. విశ్వం వైవిధ్యంతో ఏర్పడింది.

విశ్రాంతి సమయాన్ని సద్వినియోగం చేసుకో. దీర్ఘకాలం నిశ్చితగా జీవించడానికిదే త్రోవ: మానసిక శక్తి శారీరక బలాన్ని అభివృద్ధి చేస్తుంది. నిత్య చింతనతో నిద్రలోకి జారిపోవద్దు. సమస్యలతో దిగులుపడిపోతూ బెంబేలు పడిపోవద్దు. ఫలితాంశం ఏదైనా సార్థకంగా జీవించడం నేర్చుకో.

పూజా సమయం సద్వినియోగం చేసుకో. మనశ్శాంతికి మార్గమిదే. ఈ అనంతంలో బ్రహ్మాండమైన దివ్యశక్తి విశ్వవ్యాప్తమై విలసిల్లుతూంది. ఆధ్యా సామ్రాజ్యంలో నిర్విచారంగా విహరించడానికి మానవునికి ముఖ్యాతి ముఖ్యమైనది దేవతార్చన.

"లోకమున ఎయ్యది శ్రేష్ఠవస్తువో అది సులభముగా దొరకదు."

# నమ్మలేని నిజాలు

## 'యువర్ మెజెస్టీ' అని సంబోధింపబడిన మొదటి ఆంగ్లేయ చక్రవర్తి:

8వ హెన్రీ 'యువర్ మెజస్టీ' అని సంబోధింపబడిన మొదటి ఇంగ్లండురాజు. అంతకుముందు ఇంగ్లండులో రాజులు 'యువర్ హైనెస్' అని సంబోధింపబడే వారు.

* * *

## రాతి పనిముట్లు ఎప్పుడు తయారైయాయి?



2½ మిలియను సంవత్సరాలకు పూర్వం చరిత్ర కాలానికి ముందు మానవులు రాతితో పనిముట్లను తయారు చేసుకున్నారు.

## పాండా చుంచుకంటె చిన్నది:



పుట్టినప్పుడు 113 గ్రాములు తూగే పాండా చుంచుకంటే చాలా చిన్నదిగా ఉంటుంది!

## మొట్టమొదట రబ్బరు బంతులతో ఆడిన క్రీడాకారులు:

సుమారు 1,000 సంవత్సరాలకు పూర్వం మధ్య అమెరికాలో నివసించే మాయా ఇండియనులు (Maya Indians) ప్రప్రథమంగా రబ్బరు బంతులతో ఆడటం ప్రారంభించారు.

* * *

## అలాస్కా 7 మిలియను డాలర్లకు అమ్ముడు పోయింది:

అలాస్కా నేడు అమెరికాలో ఒక రాష్ట్రం. 1862 వ సం. లో అమెరికనులు రష్యానుండి 7 మిలియను డాలర్లకు దీన్ని కొన్నారు.

---

"పంచపాండవులు నరునిలోగల సద్గుణ సంపత్తి,
కౌరవులు నరునకుగల దుష్టగుణ సముదాయము."

## ఏనుగులు పడుకొని నిద్రపోవు:



ఏనుగులు నిద్రపోవడానికి పడుకోవు. సుమారు 50 సం.ల దాకా అలాగే కాళ్ళ మీద నిలబడే ఉంటాయి.

* * *

## నేపాల్ పశ్చిమదేశాల అతిథులను ఎప్పుడు అనుమతించింది ?

నేపాల్ మొట్టమొదట 1950వ సం.లో పశ్చిమ దేశాలనుండి అతిథులను నేపాలులో ప్రవేశించడానికి అనుమతించింది.

## 7 వ సం. రం వయస్సులో 'చీఫ్ ఎగ్జిక్యూషనర్':

చార్లెస్ సాన్సన్ 1726వ సం.లో తండ్రి మరణానంతరం ముఖ్య తలవరిగా తండ్రి ఉద్యోగంలో నియమింపబడ్డాడు. అప్పుడు అతడి వయస్సు 7 సం. లు మాత్రమే.

## వాటర్ క్లాసెట్‌తో మొదటి విమానం:

నీటి సౌకర్యంతో మరుగుదొడ్డి ఏర్పాటు గల మొదటి విమానం 1913 వ సం. లో రష్యాలో నిర్మించబడింది.

## ' అనే పదం ఉత్పత్తి:

'క్వీన్' అనే పదం ఆంగ్లేయ భాషలో స్త్రీ అనే అర్థమిచ్చే క్వెన్ (Cwen) మరియు 'పనికిరానిస్త్రీ' క్యూయెన్ (Quean) అనే పదం నుంచి ఏర్పడింది.

## ఎవరెస్ట్ శిఖరాన్ని ఎప్పుడు జయించారు?



1953 వ సం.లో ఎవరెస్ట్ శిఖరాన్ని మొట్టమొదట ఎక్కగలిగారు. ఆ రోజున రెండవ ఎలిజబెత్ మహారాణి పట్టాభిషేకం జరిగింది.

"ఆత్మజ్ఞానము మోక్షమునకు దగ్గరి దారి."

# వెంటనే ప్రారంభించు

నువ్వు జీవితంలో దేన్నైనా పూర్తిగా నెరవేర్చి సాధించాలనుకున్నావా? ఉత్సాహంతో వెంటనే ప్రారంభించు. మనస్సు నీకు అమూల్యమైన సాధనం. మెలకువతో యోచనలు చేయి; యోజనలు చేసుకో. యోజనలు ప్రణాళికా బద్ధం చేసుకో. నీ యోజనలకు లక్ష్యం పెట్టుకో. గురి ముఖ్యం. యోజనలతో లక్ష్యముంటే సరా. దానికి తగిన కార్యదీక్ష వెంటనే చొరవగా ప్రారంభించు. నీ భావాలు, నీ యోజనలు నీ జ్ఞాన కవాటాలను తెరుస్తాయి. ఉత్సాహంతో ప్రారంభించావా నీ శక్తి చైతన్యవంత మవుతుంది. ప్రగతి మార్గంలో నీ లక్ష్యాన్ని నువ్వు చేరగలుగుతావు.

ఎన్నెన్నో విచిత్ర, విజయ స్వప్నాలు అదృశ్యమైయాయి. ఎన్నెన్నో నూతన కల్పనలు విస్మరింపబడిపోయాయి. ఉద్దండులైన నాయకులు ఎంతమందో ఉత్సాహ లోపంవల్ల మరుగుపడిపోయారు. ఒక విలాస యాత్రకు సమకట్టావేమో? కారు సిద్ధంగా ఉంది. రోడ్డు మ్యాప్ పెట్టుకున్నావు. టైరులు, బ్రేకులు సరిగా ఉన్నాయో లేదో పరీక్ష చేసుకున్నావు. టాంకునిండా పెట్రోలు ఉంది. సామాను సర్దుకున్నావు. అన్నీ సిద్ధం చేసుకున్నావు. అయితే నీవు బయలేదరకపోతే? టూరు ఆగిపోవలసిందే. ప్రయత్నం లేకుండా ప్రయాణం ఎలా సాగిస్తావు? నీలో చోదకశక్తి ప్రవృద్ధి చేసుకో. దాన్ని పూర్తిగా వినియోగించుకో. నీ పగటి కలను సఫలం చేసుకో. నిదలో కలలు చేసుకోకు. నీ లక్ష్యం నీకు నిత్యసిద్ధమై పోతుంది.

## విద్యార్థులకు ఉపాధ్యాయులు విశ్వవిద్యాలయాల వంటివారు



ఈనాడు లాబొరేటరీలు, రీసెర్చి స్కాలర్ షిప్‌లు, లైబ్రరీలు, హాస్టల్స్, ప్లేగ్రౌండులు మొదలైన వాటన్నికంటె శిష్యుని మంచి చెడ్డలు తెలిసిన సమర్థవంతుడైన ఉపాధ్యాయుడే ముఖ్యం. ప్రాచీన భారతదేశంలో విద్యార్థులకు అడవులలో ఆశ్రమాలు, విశ్వ విద్యాలయాలు, యూరప్‌లో మధ్యయుగపు విశ్వవిద్యాలయాలు కలిగించే ఆంతరంగిక సన్నిహిత సంబంధం ఇవేవీ కలిగించలేవు. సూక్ష్మంగా చెప్పాలంటే విద్యార్థులకు ప్రేమాభిమానాలతో సన్నిహిత సంబంధం చేకూర్చుకుని వారిని జాతీయ జీవితానికి అనువుగా చైతన్యవంతులను చేసే విశ్వవిద్యాలయాలే ఉపాధ్యాయులు.

—డా. సి. పి. రామస్వామి అయ్యర్

"ధనం, విద్య, కులం దుర్మార్గులకు గర్వాన్నీ, సజ్జనులకు అణకువనూ కలిగిస్తాయి."

—భాగవతం

# ఆరోగ్యాని నడక

ిగాలు లేకపోయినా సంతోషంతో జీవితం గడపలేనివారికి ప్రపంచంలో ఒకటే దివ్య 'షధం చక చకా ఐదు మైళ్ళ దూరం డక. మన పూర్వీకులు నడకయొక్క విలులను పూర్తిగా గ్రహించి దానికి ఎంతో ప్రాముఖ్యతను ఇచ్చారు. ప్రపంచంలో ఏ తర వైద్య నిపుణులు, మనస్తత్వ శాస్త్రీలు ఇటువంటివారికి ఉపశాంతి కలిగించరు. దేహపరిశ్రమలకు సంబంధించిన



సాధనాలలో నడక సర్వోత్తమమైన వ్యాయామకళ అని నిపుణుల అభిప్రాయం. నడకంటే మామూలుగా అడుగులో అడుగు వేసుకుంటూ మెల్లిగా నడవటం కాదు. చక చకా వేగంగా చురుకుగా పెద్ద పెద్ద అంగలతో దీర్ఘంగా ఊపిరి నిలుపుతూ, మెల్లిగా ఊపిరి విడుస్తూ నడవటమే ఈ నడక.

'వ్యాయామం, ఆరోగ్యం' అన్న విషయాన్ని గురించి వ్రాస్తూ అమెరికన్ మెడికల్ అసోసియేషన్ 'కులాసాగా విహరించడం కాదు, చక చకా నడవటమే సులభమైన ఉత్తమ వ్యాయామం' అని వివరించింది. ప్రసిద్ధ హృద్రోగనిపుణుడైన డా. పాల్ డడ్లీవైట్, పెక్కుమందికి సరళవంతమైన సామాన్య వ్యాయామం నడక అని చెబుతూ, దానికి ఒక జత మంచిరకం షూలు తప్ప వేరే ఖరీదైన సాధన సదుపాయాలు అవసరం లేదని, కాలనియమం లేకుండా ఏ వయస్సులో ఉన్నవారైనా ఏ దారిలోనైనా నడవవచ్చుని. దానికి మించిన వ్యాయామం మరోటి లేదని వివరించాడు.

చురుకుగా పెద్ద అంగలు వేసుకుంటూ ఎందుకు నడవాలి? పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ నడవటంవల్ల శరీరంలో రక్త ప్రసరణ క్రమబద్ధమవుతుంది. ఈ సహజమైన సామాన్య వ్యాయామంవల్ల అధికంగా ప్రాణ

---

( 3 వ పేజీ తరువాయి)

తెలుసుకున్న యోగులు, మహాత్ములు దివ్య జీవనంతో పాటు మరణంతో స్నేహం చేసుకుంటారు. మరణం అనన్నమైనప్పుడు మందహాసంతో ఆహ్వానిస్తారు. అనంత జీవితానికి 'మరణం' ప్రారంభ దశ.

ఐహిక విషయాలకు వ్యర్థం చేసిన కాలాన్ని ఒక్కసారి పరీక్షించి తెలుసుకో. అనంత జీవితానికి ఎంత కాలం వి యోగించావో విమర్శించుకో. జీవితంలో ఎన్ని అవస్థలు సంభవించినా సామరస్యంతో ఏక లక్ష్యానికి అనుసంధానం చేసుకోగలిగితే జీవితం నవనవోన్మేషంగా ఆనందమయమవుతుంది.

నాయువు పిల్చగలుగుతారు. హృదయం చక్కగా పని చేస్తుంది. శరీరంలో రక్త ప్రసరణ సక్రమంగా జరుగుతుంది.

చురుకుగా నడవటంవల్ల మానవ శరీరంలో 60,000 మైళ్ళ రక్తనాళాలకు సంబంధించిన సూక్ష్మకేశనాళాలగుండా కెపిలరీ విధానంలో జరిగే రక్తప్రసరణ క్రమపడుతుంది సూక్ష్మకేశనాళాలు ఉత్తేజం పొంది చైతన్యవంతం అవడమే కాకుండా, వివిధ కండరాల అభివృద్ధికి అధిక పోషణ కలిగించడానికి క్రొత్త క్రొత్త సూక్ష్మ కేశనాళాలు పుట్టుకు వస్తూంటాయి.

చురుకుగా నడవటంవల్ల కలకబారిన మనస్సు తేటబారి నిర్మలంగా ఉంటుంది. శీలం, స్వభావం మారుతుంది. మానసిక శాంతి కలుగుతుంది. బిగువు సడలుతుంది. శీఘ్రంగా నడవటంవల్ల అధికంగా రక్తం మెదడుకు ప్రవహిస్తుంది. రక్తానికి కావలసిన ప్రాణవాయువు ఎక్కువ లభిస్తుంది. మనస్సుకు శాంతి ఏర్పడుతుంది - అని డా. వైట్ అభిప్రాయం. అంతేకాదు మానవునిలో ఉండే సౌందర్యారాధన ప్రవృద్ధిపొందుతుంది. మంచి నడకను అభ్యాసం చేసుకున్న విలియమ్ వర్డ్స్‌వర్త్ ప్రకృతి సౌందర్యాన్ని అనుభవిస్తూ ఎన్నెన్నో సుప్రసిద్ధ పద్యాలు వ్రాయగలిగాడు.

పెద్ద పెద్ద అంగలతో నడవటంవల్ల బడలిక, ఆయాసం ఉండదు. కోపతాపాలు చల్లారతాయి. ప్రతిరోజూ ఈ విధంగా నడవడం అభ్యాసం చేసుకుంటే శారీరక సౌందర్యం పెరుగుతుంది. ముఖం క్రొత్త కళతో తేజోవంతంగా తేటగా ప్రకాశిస్తుంది. బాగా దుమ్ముచేరిన కిటికీని శుభ్రంచేసి చూస్తున్నట్లు ఒక నూతనానుభవం కలుగుతుంది. మొత్తంమీద దేహ ఆరోగ్యాన్ని అన్నివిధాలా కాపాడుకోగలుగుతారు. ఏ ఔషధాలు, మందులు ప్రమేయం లేకుండా ఎన్నెన్నో సత్ఫలితాలను నడకవల్ల అతి సులభంగా పొందుతారు.

## భారతదేశంలో సగటు ప్రత్తిపంట



ఒకప్పుడు ప్రత్తిని దిగుమతి చేసుకునే భారతదేశం నేడు సాలుకి సుమారు 4—6 లక్షల బేళ్ళ ప్రత్తిని ఎగుమతి చేస్తూంది. ప్రపంచంలో సగటు ప్రత్తిపంట హెక్టేరుకి 442 కి.గ్రా.లు అయితే మనదేశంలో సగటు ప్రత్తిపంట హెక్టేరుకి 167 కి. గ్రా. లు మాత్రమే. ప్రపంచంలో ముఖ్యంగా ప్రత్తిని పండించే అమెరికా, సోవియెట్ యూనియన్, ఈజిప్టు వంటి దేశాలలో ఇవి వరుసగా 613 కి.గ్రా. 912 కి.గ్రా.లు మరియు 963 కి.గ్రా. లు.

"ఒకనాడు పుట్టింటివారు ఐచ్ఛికంగా ఇచ్చే స్త్రీధనం నేడు అత్తవారి అత్యాశకు ఇంధనమైంది."

# గాంధీజీ అమరవాణి

మానవునిలో వ్యక్తిత్వం పూర్తిగా నశించి పోయినప్పుడు సమాజంలో ఆ మానవుని విలువ ఏముంటుంది? వ్యక్తిత్వం నశింపజేసుకుని యాంత్రికంగా జీవించడం మానవునికి గౌరవహీనం. ధర్మం ఎన్నటికీ ధర్మమే. ఆచరించలేక వదలుకోకూడదు. ధర్మం ఆచరించి తీరవలసిందే.


GANDHIJI

ఒక పురుషునికి విద్య నేర్పితే నీవు ఒక్కరికే విద్య నేర్పగలుగుతున్నావు. కాని ఒక స్త్రీకి విద్య నేర్పితే ఆ కుటుంబాన్ని అంతా విద్యావంతులను చేసినవాడవవుతావు.

ప్రజలకొరకు ప్రజలచే ప్రజాప్రభుత్వం అనేది ఏదో ఒక వ్యక్తివల్ల సాధ్యమయ్యే కార్యం కాదు. ప్రతి మానవ హృదయంలోను సత్యం దోబూచులాడుతూ ఉంటుంది. అన్వేషించి ఆ సత్యాన్ని సాధించాలి. అది చూపే మార్గం అనుసరించాలి. నీ సత్యమార్గంలో ప్రవర్తించమని ఇంకొకరిని నిర్బంధించలేవు. ఒకరికి అన్యాయం చేస్తూ ధర్మవిరుద్ధంగా ప్రవర్తించే వ్యక్తి మరో ప్రక్క ధర్మం ఆచరించలేడు. జీవితం అవిభాజ్యం. పరిపూర్ణతే జీవిత లక్షణం.

విభిన్న మతాలు ఒకే గమ్యానికి కొనిపోయే భిన్నమార్గాలు. మనం అందరూ ఒక లక్ష్యాన్ని సాధించాలనుకున్నప్పుడు ఏదారైనా పట్టుకోవచ్చు. నా ఇంటికి అడ్డుగోడలు పెట్టుకోవాలని ఇష్టంలేదు. నా ఇంటి కిటికీ తలుపులు మూయను. యధేచ్ఛగా అన్ని మతాలు ధర్మాలు నిరాటంకంగా ప్రవేశించవచ్చు. కాని నా ధర్మాన్ని నేను సంరక్షించుకుంటాను.

## తమ జాతి అపరిమితంగా పెరిగితే కోతులు సహించలేవు

**తమజాతి అమితంగా పెరిగిపోతూంటే కోతులు ఎంత మాత్రం సహించలేవు. గుంపులు గుంపులుగా చెదిరిపోతాయి. ఒక గుంపులో 100 కంటె అధికంగా కోతులుంటే వాటిలో చీలికలు ఏర్పడతాయి అని ఢిల్లీ యూనివర్శిటీ ఇన్‌స్టిట్యూట్ ఆవ్ హోమ్ ఎకనామిక్స్‌కు చెందిన డా. ఇక్బాల్ మాలిక్ అనే ఆమె రెసూస్ (Rhesus) జాతి కోతుల మీద పరిశోధన చేసి చెబుతూంది.**

"పనులు చేయకుండా భగవతుణ్ణి ప్రార్థించే భజనపరులు బాగుపడరు."

# ప్రపంచంలో ఉన్నతమైన టవరులు

అమెరికాలో చికాగోలోను, జపానులో టోకియోలోను, ఫ్రాన్స్‌లో పారిస్‌లోను ఉన్న టవరులు ప్రపంచంలో మిక్కిలి ఉన్నతమైన మూడు టవరులు. ఈ మూడు మహోన్నత శిఖరాలలో చికాగోలో ఉన్న సియర్స్ టవర్ చాలా ఎత్తయిన ఆకాశ భవనం.

సియర్స్ టవర్: చికాగోలో నిర్మించబడిన 110 అంతస్థుల సియర్స్ టవర్‌కి మొత్తం 76,000 టన్నుల ఉక్కు చట్రాలు ఉపయోగించబడ్డాయి. భవనంపైన అంటెనాల జతతో దాని మొత్తం ఎత్తు 1,707 అడుగులు. దీని నిర్మాణానికి ఉపయోగించబడిన కాంక్రీటు 8 బస్సులు పోయే వెడల్పైన 5 మైళ్ళ పొడవు పెద్ద రహదారి వేయడానికి సరిపోతుంది. మొత్తం 2,22,500 టన్నుల బరువున్న ఈ భవనం 114 ప్రత్యేక కెయిసాన్స్ (Caissons) రాతి స్తంభాల మీద నిలబడి ఉంటుంది.


సియర్స్ టవర్

ఈ భవనాన్ని నిర్మించడానికి సుమారు 3 సంవత్సరాల కాలం పట్టింది. మొత్తం 12,000 మంది ఈ భవనంలో పనిచేస్తారు. వాటంతటవే నీటిని జల్లుకునే ఆటోమేటిక్ స్ప్రింక్లర్లు. అగ్ని ప్రమాదాలకు స్మోక్ డిటెక్టరులు, అవసరమైనప్పుడు వెంటనే ఉపయోగానికి డీసెల్ జనరేటర్లు, మంచి అధునాతనమైన సమభావ సంబంధ సంపర్క

## క్విబెక్‌కు అతి దూరంగా ఉత్తర దిక్కున మిక్కిలి పెద్ద క్రాటరు

ఒక్కొక్కప్పుడు ఖగోళంలోనుంచి మీటియారులు, నక్షత్రాలు మొదలైన ఉల్కలు భూమిపైపడి పెద్ద పెద్ద పల్లాలు (క్రాటరులు) ఏర్పడతాయి. ఉత్తర క్విబెక్‌లో ఏర్పడిన మిక్కిలి పెద్ద క్రాటరు (crater) "చబ్ క్రాటరు." దీని వెడల్పు సుమారు 11,200 అడుగులు. నీటిమట్టానికి లోతు 500 అడుగులు. మొత్తం దీని లోతు 825 అడుగులు. సుమారు 4,200 అ. వెడల్పు, 600 అ. లోతుగల రెండవ పెద్ద క్రాటరు అరిజోనాలో ఉంది. 3,000 అ. వెడల్పు గల క్రాటరు ఆస్ట్రేలియాలో ఉంది. ఈ క్రాటరులు అన్నీ మానవుడు భూమి మీద ఆవిర్భవించక ముందు ప్రాచీన కాలంలో ఏర్పడినవే.

"మామూలు మాటల్లో చెప్పలేని భావాలు
కవితారూపంలో వెల్లడవుతాయి."

—జెయిల్ సింగ్

గాకర్యాలతో ప్రజలకు పూర్తి కలిపిస్తుంది.

టోకియో టవర్: జపానులోని 333 మీటర్ల టోకియో టవర్ పెద్ద పెద్ద భూకంపాలను, సెకండుకు 90 మీటర్ల వేగంతో వచ్చే తుఫానును కూడా తట్టుకో గలిగినంత దిట్టంగా కట్టబడింది. 8 టెలివిజన్ స్టేషనులు, మూడు F.M. రేడియో స్టేషనులు చేసే ప్రసారాలు ఇందులో ఏర్పాటైన అంటెనాల ద్వారా



ప్రసారమవుతాయి. టోకియో టవరు ఒక గొప్ప పురావస్తుశాల. ప్రపంచంలో అన్ని ముఖ్యదేశాలకు సంబంధించిన 100 మంది కర్షకుల శిలా విగ్రహాలు జీవకళతో ఉట్టి పడుతూంటాయి. టోకియో టవర్ మత్స్య ప్రదర్శనశాలలో సుమారు 8,000 రకాల చేపలను ప్రదర్శిస్తారు. టోకియో టవర్ పై భాగంలో ఏర్పాటైన టోకియో పోలీసు కెమేరాలు రోడ్లపై రాకపోకలను నియంత్రిస్తూంటాయి.

ఎఫిల్ టవర్: ఫ్రాన్స్ రాజధాని నగరం పారిస్‌లో ఎఫిల్‌టవర్ పూర్తిగా ఉక్కుతో నిర్మించబడింది. సాంప్రదాయక నిర్మాణ నిబంధనలకు భిన్నంగా తీర్చిదిద్ది, దీనిని పూర్తిచేయడానికి 2 సంవత్సరాలు పట్టింది. దీనిపైన ఏర్పాటుచేసిన ఏరియల్ భూమట్టం నుంచి 320 మీటర్ల ఎత్తుంటుంది. 12 000 ఉక్కు గర్డర్లు 25,00,000 రివెట్లతో చేర్చబడి ఉంటాయి.

## సుభాషితాలు

"వేరుపురుగు చేరి వృక్షంబు చెరచును
చీడపురుగు చేరి చెట్టు చెరచు
కుచ్చితుండు చేరి గుణవంతు చెరచురా
విశ్వదాభిరామ వినుర వేమా!"

[వేరున పురుగు బట్టి వృక్షాన్ని చంపుతుంది. అదే విధంగా చీడపురుగు చెట్టును చంపుతుంది. చెడ్డవాడు మంచివానిని పాడు చేస్తాడు.]

* * *

"ఉప్పులేని కూర యొప్పదు రుచులకు
పప్పులేని తిండి ఫలము లేదు
అప్పులేనివాడె యధిక సంపన్నుడు
విశ్వదాభిరామ వినుర వేమా!"

[ఉప్పులేని కూర, పప్పులేని భోజనం రుచికరంగా ఉండదు. కాని అప్పులేని వాడే చాలా గొప్పవాడు.]

"ఈనాడు భూమి మీద మనీషిలా మనలేని మనిషి
అంతరిక్షానికి ఎగురనూగలడు; నీటిలో ఈదనూ గలడు."

# నిజాలు - నిదర్శనాలు

## కేరళలో రూ. 4,500 మి. విలువ గల కొబ్బరికాయలు పండింపబడ్డాయి:



కేరళలో పండింపబడే కొబ్బరికాయల మీద సగటు రాబడి రూ. 4,500 మిలియను. కొబ్బరిపీచు వస్తువుల ఎగుమతి మీద రాబడి రూ. 190 మిలియను. కొబ్బరితో తయారైన ఇతర వస్తువుల అంతర రాష్ట్రీయ వ్యాపారంవల్ల సంవత్సరానికి రూ. 1,250 మిలియను ఆదాయం లభిస్తుంది.

* * *

## సోవియెట్ యూనియన్‌తో పెద్ద వ్యాపార భాగస్వామి భారతదేశం:

సోవియెట్ యూనియన్‌తో వ్యాపార భాగస్వామ్యం గల అభివృద్ధి పొందుతున్న దేశాలలో భారతదేశానిదే మిక్కిలి పెద్ద వ్యాపార భాగస్వామ్యం. సోవియెట్ యూనియన్ మొత్తం వ్యాపారం మరియు ఎగుమతి, దిగుమతులలో 2 శాతం భారతదేశానిదే. భారతదేశం మొత్తం విదేశీ వ్యాపారంలో 30 శాతం సోవియట్ యూనియన్‌దే. 1970-85 సంవత్సరాల మధ్య వ్యాపారం సగటు సాలు అభివృద్ధి 15 శాతం మించి ఉంది.

* * *

## కంప్యూటర్ పరిశ్రమ ఆదాయం పెరుగుదల 70 శాతం:

1985-86 వ సంవత్సరంలో కంప్యూటర్ పరిశ్రమలో మొత్తం ఆదాయం రూ. 234 కోట్లు. ఇది 1984-85 ఆదాయంమీద 70 శాతం అధికం. పరిశ్రమ బాగా అభివృద్ధి చెందడంవల్ల సగటున 1984-85 లో రూ. 2 లక్షలు ఉన్న కంప్యూటర్ విలువ 1985-86 లో 1.3 లక్షలకు పడిపోయింది.

* * *

## పంజాబ్‌లో తలసరి ఆదాయం మిక్కిలి అధికం:

డైరెక్టరేట్ ఆఫ్ ఎకనామిక్స్ అండ్ స్టాటిస్టిక్స్‌వారి నిర్ణయం ప్రకారం కేంద్ర పాలిత రాష్ట్రాలలో ఢిల్లీ 1984-85 సం.లో రూ. 4,191 ల తలసరి ఆదాయంతో ప్రథమ స్థానాన్ని పొందుతూంది. ఇదే కాలంలో రాష్ట్రాలలో పంజాబ్ రూ. 3,835 ల తలసరి

"తెలివి తేటలుండి తేజస్వియైయుండి
పెదవి కదుప నతడు పెద్దమనిషి."

దాయంతో ప్రథమ స్థానాన్ని పొందింది. ప్రస్తుతం చలామణిలో ఉన్న విలువలనుబట్టి 984-85 సం.లో భారతదేశం తలసరి దాయం రూ. 2,344 లు.

* * *

## తలసరి విద్యుచ్ఛక్తి వినియోగం:

అమెరికాలో తలసరి 11 టన్నుల బొగ్గుకు సరిపోయే ఇంధనం వినియోగమవుతుంటే, భారతదేశంలో సంవత్సరానికి 400 కి. గ్రా. బొగ్గుకు సరిపోయేటంత మాత్రమే వినియోగమవుతూంది. ప్రపంచంలో తలసరి 1000 KWH, అమెరికాలో 7000 KWH వినియోగమవుతున్న విద్యుచ్ఛక్తి భారతదేశంలో 100 KWH మాత్రమే వినియోగమవుతూంది.

* * *

## భారతదేశంలో 1000 మి. టన్నుల సేంద్రియ పదార్థాలు లభిస్తున్నాయి:

భారతదేశంలో సుమారు 1000 మిలియను టన్నుల సేంద్రియ పదార్థాలు ముఖ్యంగా పనికి రాకుండా మిగిలిపోయిన అనేక పంటలు, ధాన్యాలనుండి, మరో 300 నుండి 400 మిలియను టన్నులు పశువుల పేడ, ఇతర విసర్జనలవల్ల లభ్యమవుతూంది. ఈ సేంద్రియ పదార్థాలలో ఉండే రమారమి 6 మిలియను టన్నుల నత్రజని, 2.5 టన్నుల భాస్వరం, 4.5 టన్నుల పొటాషియం భూసారాభివృద్ధికి సహకరిస్తాయి.

* * *

## మొరాకోలో సీసపు నిధులు అధికం:

అరబు రాజ్యాలలో మొత్తం సీసపు నిధులు 70,139 మిలియను టన్నులు అని అంచనా వేయబడింది. మొరాకోలో 30,336 టన్నులు లభిస్తుంది. దీని తరువాత అల్జీరియాలో 16,380 మిలియను టన్నులు, ట్యునీషియాలో 12,725 మిలియను టన్నులు లభిస్తుంది.

* * *

## వ్యాపారాభివృద్ధికి 1,00,000 విసిఆర్ లు:

మొత్తం 6,00,000 వీడియో క్యాసెట్ రికార్డర్లలో అధమం 1,00,000 విసిఆర్ లు పార్లరులలోను, పెద్ద పెద్ద నాగరికుల ఇళ్ళలోను, భారతదేశపు చుట్టుపట్ల గ్రామాలలోను మరి కొన్ని 2,000 వీడియో బస్సుల కోచీలలోను ఉపయోగిస్తున్నారు.

* * *

## దేశంలో మిక్కిలి ఎక్కువ కాలుష్యమైన నగరం బొంబాయి:

ప్రస్తుతం దేశంలో మిక్కిలి ఎక్కువగా కాలుష్యమైన నగరం బొంబాయి. ప్రతీ రోజూ 263 టన్నుల కార్బన్ మోనాక్సైడు, 40 టన్నుల సల్ఫర్ డయాక్సైడు, 27 టన్నుల నైట్రోజన్ ఆక్సైడు, 37 టన్నుల హైడ్రోకార్బనులు, 30 టన్నుల ఇతర ఘన పదార్థాలు వాతావరణంలోకి చేరుతున్నాయి.

"తాను తెలివిగలవాడనని విర్రవీగేవాడు
పాపం ఎంత గొప్ప మూర్ఖుడో కదా!
-వాల్టేర్

# వృద్ధాప్యము-కొన్ని సమస్యలు

కర్మపరిపాకంవల్ల, పూర్వజన్మ సుకృతంవల్ల మానవుడు భూమిమీద అవతరిస్తాడు. పుట్టిన మానవుడు మరణిస్తాడు; మరణించక తప్పదు. జీవుడు ఏలా ఆగమిస్తాడో అలాగే నిష్క్రమిస్తాడు. జన్మించడం అనేది మరణించడం అంత ముఖ్యమైనది. జననం గూర్చి అంతగా తెలియకపోయినా జీవుడు తన భౌతిక దేహాన్ని వదలి వెళ్ళే సమయానికి సుఖమో, దుఃఖమో జీవిత నాటకం సమాప్తమవుతుంది.



సర్వసాధారణంగా 50 ఏళ్ళు వయస్సు నిండేటప్పటికి ముసలితనం ముంచుకు వస్తుందనే వయోచైతన్యం, భయం మానవులలో ఏర్పడటం సహజం దైహికంగా మార్పులు ఏర్పడతాయి. తమ కుటుంబం అభివృద్ధి కోసం పాటుబడ్డ తలిదండ్రులకు ఈ వృద్ధాప్యం శాపంగా పరిణమిస్తుంది. మానసికంగా మార్పులు వస్తాయి. అసంతృప్తి, నిస్పృహ, మొండితనం ఏర్పడతాయి. సమాజానికి, కుటుంబానికి తమ అవసరం లేదనే భావన ఏర్పడుతుంది.

వృద్ధ జనాభా నానాటికీ పెరిగిపోతూంది. ఈనాడు మానవుడు దీర్ఘకాలం జీవించగలుగుతున్నాడు. ఎన్నెన్నో అమోఘమైన క్రొత్త క్రొత్త మందులు కనిపెట్టబడ్డాయి. కనసీ, వినసీ రోగాలన్నిటిపీ అరికడుతున్నారు. ఆరోగ్యాభివృద్ధి చేస్తున్నారు. ఆయుర్వృద్ధి కలిగిస్తున్నారు. సహజంగా ప్రపంచంలో జనాభా పెరుగుతున్నకొద్దీ వృద్ధులు అమితంగా తయారవుతున్నారు. వృద్ధాప్యం అనివార్యం. అనివార్యమైన వృద్ధాప్యం అనుభవించి తీరాలి. అనుభవించి తీరవలసిన వృద్ధాప్యంలో అన్నీ సమస్యలే.

రోజులు మారిపోతున్నాయి. దేశం పారిశ్రామికాభివృద్ధితో ప్రగతిని పొందుతూంది. ఉద్యోగావకాశాలు అధికమవుతున్నాయి. వ్యక్తులు కుటుంబం అనే పంజరంలోనుంచి విడిపోతున్నారు. యువకుల మనోభావాలు

## 11 మాసాలలో 85,623

### కి.మీ.ల ప్రయాణం

బెల్జియన్ దేశస్థుడైన బ్రూనో ల్యూనెన్ Bruno leunen)అనే యువకుడు బెల్జియంలోని బ్రస్సెల్స్ నుండి విమానంలో బయలుదేరి దారిలో వివిధ దేశాలలో 109 చోట్ల విశ్రమిస్తూ న్యూజిలాండులోని అక్లండ్‌కు ప్రయాణం సాగించాడు. మొత్తం 85,623 కి.మీ.ల దూర ప్రయాణం చేయడానికి ఇతడికి 11 మాసాలు పట్టింది.

"సాహిత్యం సృష్టి అయితే, విమర్శ పునస్సృష్టి అవుతుంది."

మారిపోతున్నాయి - యువకులకు వృద్ధుల మనస్తత్వాలు అర్థం కావు. వృద్ధులకు యువకుల మనస్తత్వాలు అవగాహన కావు. సంసారంలో పరస్పర ఘర్షణలకు తావు కలుగుతూంది. వృద్ధాప్యంలో అశక్తత, దుర్బలత్వం ఏర్పడి రోగాలు పీడిస్తాయి. వృద్ధుడికి దురవస్థ, దుఃఖం అధికమవుతాయి. సమాజానికీ, కుటుంబానికీ తన ప్రమేయం లేదనే భావన వృద్ధునిలో ఏర్పడుతుంది. ఈవిధంగా సమాజానికీ, కుటుంబానికీ దూరమైన వృద్ధులకు జీవితం తమకే కాకుండా అందరికీ భారమనిపిస్తుంది. 50 సంవత్సరాలపాటు ప్రపంచంలో మునిగి తేలుతూన్న వృద్ధుడు ఒక్కసారిగా నూతన పరిసరాలకు సంస్కారాలకు తన జీవితాన్ని మలచుకోలేక తికమకలు పడుతున్నాడు.

వృద్ధాప్యంలో గానీ, యౌవనంలో గానీ మనుగడలో ఒడుదుడుకులకు మనస్సే కారణం. మమతలు పెంచుకుంటే మనుగడ బాగుంటుంది. అనురాగాలు పెంచుకోవాలి. వృద్ధులు తమ కాలం అయిపోయిందని ప్రశాంతంగా, నిశ్చింతగా, నెమ్మదిగా కాలం గడపటానికి వాతావరణాన్ని ఏర్పరచుకోవాలి. ఇంట్లో వృద్ధులు యువకులకు భారమనిపించకూడదు. యువకులు కూడా ఇంట్లో వృద్ధులకు గౌరవ మర్యాదలతో తగిన స్థానమిచ్చి గౌరవిస్తే మనశ్శాంతి కలుగుతుంది. వృద్ధుల జీవితం ప్రశాంతంగా నడుస్తుంది.

చేస్తూన్న ఉద్యోగంలో నుంచి రిటైరు కావాలి. ఉద్యోగం కలకాలం ఉండదు. మనస్సులో దిగులు బయలుదేరుతుంది. వేరే వ్యాపకం లేక భయంతో, చింతతో కుమిలిపోతాడు. నీ ఇంట్లో పెత్తనం మారినట్లే ఆఫీసులోను నీ పెత్తనం మారుతుంది. ఎందుకు భయం? అనివార్యమైన వృద్ధాప్యాన్ని విలాసవంతంగా, సంతోషంగా అనుభవించాలి. వయస్సులో ఉన్నప్పుడే జాగ్రత్త పడాలి. స్వంత ఇల్లులేని వృద్ధుడు రిటైరు అవటానికిముందే వాసయోగ్యమైన గృహవసతికి ఏర్పాటు చేసుకోవాలి. బ్యాంకులలో రిటైర్మెంటు బెనిఫిట్ స్కీములున్నాయి. సంపాదిస్తున్నప్పుడే సక్రమంగా ఆదా చేసుకుంటే రిటైరు అయిన తరువాత నెల నెలా వడ్డీ జీతంలా వస్తుంది. ఆర్థికంగా స్వతంత్రుడవై యున్నప్పుడు వృద్ధాప్యం అంత కష్టమనిపించదు. ఉషారుగా ధనం సంపాదిస్తున్నప్పుడే ఇంట్లోగానీ, సమాజంలోగానీ గౌరవము, మర్యాద. వృద్ధాప్యంలో కాలాన్ని

## హంస బ్రహ్మవాహనం



త్రిమూర్తులలో మొదటివారైన బ్రహ్మ వాహనం హంస. రెండవవారైన విష్ణు వాహనం గరుడుడు. మూడవవారైన రుద్రుని వాహనం నంది.

---

"జీవిత సమస్యలను పూర్తిగా తెలుసుకోడానికి శక్తి లేనప్పుడు జీవితం ఎప్పుడూ బాధాకరమే."

వృధా చేయకుండా తన శక్తికి అనుకూలంగా వ్యాపకం కలిగించుకోవాలి. కొన్ని కొన్ని క్రొత్త అభిరుచులు, అలవాట్లు పెంచుకోవాలి. నిత్యజీవితాన్ని కాలపట్టికకు అనుగుణ్యంగా నడుపుకోవాలి. అప్పుడే జీవితంలో వృద్ధాప్యం సామరస్యంగా నడుస్తుంది.

వృద్ధాప్యంలో శారీరక ఆరోగ్యం ఉండవచ్చు. ఆర్థిక స్తోమత ఉండవచ్చు. కానీ వృద్ధాప్యం వచ్చినప్పుడు ఇతర వ్యాపకాలు ఉండవు. కాలక్షేపాలకు అనుకూలాలు ఉండకపోవచ్చు. అలాంటప్పుడు జీవితం భారం అనిపిస్తుంది. వృద్ధాప్యాన్ని విస్మరించి కొన్ని నూతన అభ్యాసాలను అలవాటు చేసుకుని కాలాన్ని సద్వినియోగం చేసుకుంటే వృద్ధాప్య జీవితం హాయిగా గడిచిపోతుంది.

వృద్ధాప్యం సమీపిస్తున్నకొద్దీ యౌవనాన్ని నిలబెట్టుకోవాలి. గాలివానకు బలహీనమైన చెట్టు కొమ్మలే దెబ్బతింటాయి. ఎండిపోయిన కొమ్మలే పడిపోతాయి. వాస్తవంగా నిన్ను వృద్ధునిగా చేసేవి వృద్ధాప్యం కాదు. వృద్ధుడనవుతున్నావనే మనోవ్యధే నీకు త్వరగా వృద్ధాప్యాన్ని తెచ్చిపెడుతుంది. వృద్ధాప్యాన్ని ఆపుచేసుకోడం అంత కష్టం కాదు. మీకు ఎదురయ్యే సమస్యలన్నిటినీ చిరునవ్వుతో ఎదుర్కో. చిరునవ్వే వృద్ధాప్యానికి రక్ష. కోపతాపాలకు తావీయవద్దు. అనివార్యమైన వృద్ధాప్యాన్ని చిరునవ్వుతో ఆహ్వానించు. వృద్ధాప్యంలో ప్రశాంతంగా గడపడానికి అవసరమైన పరిస్థితులు కల్పించుకో. ఉత్సాహవంతమైన విద్యావ్యాసంగం అలవాటు చేసుకో. ఆహార నియమాలను అనుసరించు. వృద్ధాప్యం ఏవిధంగా పరిణమిస్తుందో తెలుసుకో. సాంఘిక పరిస్థితులను అవగాహన చేసుకో. రిటైరు అయిన తరువాత కూడా బుద్ధికుశలతను తగినవిధంగా పెంపొందించుకో. అకస్మాత్తుగా ఉద్యోగం నుంచి విరమించుకోకూడదు. క్రమక్రమంగా పనిని తగ్గించుకో. శారీరకంగా చురుకుదనం ముఖ్యం. మానసికంగా ఉత్సాహాన్ని పెంచుకో. వివేకవంతంగా వృద్ధాప్యాన్ని అనుభవించగలుగుతావు.

అంటురోగాలు, ఇతర జాడ్యాలు కలుగకుండా సకాలంలో రోగనిరోధక చర్యలను అవలంబించు. ఆరోగ్యాన్ని నిలబెట్టుకో. శారీరకంగా శ్రమను కలిగించే పెద్ద పెద్ద పనులను తగ్గించు. సిగరెట్ కాల్చడంలోగానీ, వైనులు త్రాగడంలోగానీ మితిమీరిపోకూడదు. కెఫీను అధికంగా ఉన్న పానీయాలను ఎక్కువగా సేవించకు. మితిమీరి తినకు. ఆహార నియమం పాటించు. చింత పడిపోవద్దు. నరాల బిగువు సడలించుకో. సర్వత్ర సమభావాన్ని అలవరచుకో. సరి అయిన వాతావరణాన్ని ఏర్పరచుకో. జీవిత విధానాన్ని సక్రమంగా మలచుకో. రిటైర్మెంటు అంటే నీ జీవిత ఆశయాలు అడుగంటిపోయాయి అని అనుకోనక్కరలేదు. వాస్తవానికి మంచి రోజులు ఇంకా ముందున్నాయనే విషయాన్ని గ్రహించాలి. నీకు నీ మనస్సే బంధువు. నీ మనస్సే శత్రువు. నీవు మనస్సును స్వాధీనంలో ఉంచుకో. ఆత్మనాశనాన్ని కలిగించుకోకు. అప్పుడు వృద్ధాప్యంలో కూడా నిన్ను నీవు ఉద్ధరించుకున్నవాడవు కాగలవు. —తాడూరి

"వివేకాత్మకమైన పౌరసంస్కారాభివృద్ధికి
సహకరించేది సుప్రసిద్ధ వార్తాపత్రిక."

# అవీ - ఇవీ

**ప్రపంచంలో కంప్యూటర్ చైతన్యత అధికంగా గల దేశం:**

ప్రపంచంలో మిక్కిలి అధికంగా కంప్యూటర్ చైతన్యత గల దేశంగా రూపొందించాలనే లక్ష్యంతో ఫ్రాన్స్ 200 మిలియను డాలర్ల వ్యయంతో నూతన ప్రణాళికను చేపట్టింది. ప్రస్తుతం వాడకంలో ఉన్న 35,000 కంప్యూటర్లకు ఇంకా 1,20,000 డెస్కు-టాప్ కంప్యూటర్లు చేర్చబడతాయి. ఇవన్నీ మొత్తం 11 మిలియను స్కూలు, కాలేజీ విద్యార్థులకు బోధనా సదుపాయాన్ని కలిగిస్తాయి.

**రెండు శతాబ్దాలు పైబడి నడుస్తున్న 'ది టైమ్స్':**



బ్రిటన్‌లో ముఖ్యమైన వార్తాపత్రిక దిటైమ్స్‌కు 200 సంవత్సరాలు దాటాయి. అమెరికా విప్లవం జరిగిన 9 సంవత్సరాల తరువాత, ఫ్రెంచి విప్లవానికి 4 సంవత్సరాల ముందు జనవరి 1, 1785 న 'యూనివర్సల్ డెయిలీ రిజిష్టర్' అనే పేరుతో స్థాపింపబడిన ది టైమ్స్‌కు ఆ నాడు ఉన్న 1,000 సర్క్యులేషన్ ఇప్పుడు 4,64,000 ఉంది.

* * *

**ఖాదీ ఉత్పాదనకు ఉత్తరప్రదేశ్‌దే ప్రథమ స్థానం:**

1984-1985 సం.లలో 33.14 మిలియను చదరపు మీటర్ల ఖాదీ బట్టను ఉత్పత్తి చేసి ఉత్తరప్రదేశ్ ప్రథమ స్థానాన్ని పొందింది. 19.10 మి.చ. మీ. ఉత్పాదనతో తమిళనాడు రెండవ స్థానాన్ని, 7.95 మి.చ. మీ. ఉత్పాదనతో గుజరాత్ మూడవ స్థానాన్ని ఆక్రమిస్తున్నాయి. భారతదేశంలో ఖాదీ ఉద్యమం సంవత్సరానికి 13.05 లక్షల మందికి ఉద్యోగావకాశాలు కలిపిస్తుంది.

* * *

**స్టీవ్ ఫోన్యో మరథాన్ ప్రయాణం:**

క్యాన్సరువల్ల ఎడమ కాలు తీసివేయబడ్డ 19 సం. ల వయస్సు గల కెనడా దేశస్థుడు స్టీవ్ ఫోన్యో కెనడా దాటి అట్లాంటిక్ మహాసముద్రం నుంచి పసిఫిక్ మహాసముద్రం వరకు సుదూరం కాలినడకతో ప్రయాణం చేసాడు. దారిలో ఇతడు సేక

"మాటకు మాట తెగులు, నీటికి పాచి తెగులు."

రించిన 7 మిలియను డాలర్లు క్యాన్సరు వ్యాధి పరిశోధనకు ఇవ్వదలచుకున్నాడు.

* * *

**ఉదకమండలంలో క్షీరోత్పాదక కేంద్రం:**

తమిళనాడు నీలగిరి జిల్లా ఉదకమండలంలో రూ. 3.5 కోట్లతో పాల ఉత్పత్తి సంకీర్ణ కేంద్రం స్థాపించబడింది. ఇది రోజుకి 50.000 లీటర్ల పాలను ఉత్పాదించడమే గాకుండా, 2 టన్నుల చీస్‌ను (పెరుగుతో తయారైనది) కూడా తయారు చేస్తుంది.

**10 సంవత్సరాల నుంచి కాన్వకేషన్ నోచుకోని యూనివర్సిటీ:**

ఉత్తరప్రదేశ్ అలహాబాద్ విశ్వవిద్యాలయంలో గత 10 సంవత్సరాల నుంచీ స్నాతకోత్సవమే జరగలేదు. ఇక్కడ 1,00,000 మంది విద్యార్థులకు డిగ్రీలు లభించలేదు!

* * *

**వీడియో డిస్కు సర్వస్వం:**

'నాలెడ్జి డిస్కు' అనబడే వీడియో డిస్కు ఎన్‌సైక్లోపీడియా (సర్వస్వం) జపాన్ మార్కెట్‌లో ప్రవేశపెట్టబడింది. మొత్తం 20 సంపుటాల యు. ఎస్. అకడమిక్ ఎన్‌సైక్లోపీడియా ఈ డిస్కు మీద గ్రహించబడింది. 5,917 పేజీలు గల ఎన్‌సైక్లోపీడియాలో ప్రతీ పుటకి ఫోటో ఒకటి డిస్కులో రికార్డు చేయబడి ఉంటుంది.

**ఎలా?**

## భూకంపాలు ఎలా ఏర్పడుతున్నాయి?



ఒక వాదం ప్రకారం హిమాలయా(భారతదేశం), ఆండీసు (దక్షిణ అమెరికా వంటి పెద్ద పెద్ద పర్వతాలకు పైకి తోపు[illegible] శక్తి ఉంటుంది. ఐసుబర్గులు కరిగేటప్పు[illegible] మంచుగడ్డ కొంత నదీప్రవాహాలలో కొట్టు[illegible] పోతుంది. అదేవిధంగా పర్వత శ్రేణు[illegible] నదులలో కొట్టుకుపోతాయి. పర్వత పా[illegible] ప్రదేశాల చుట్టూ ఉండే భూప్రదేశంలో ఒత్తిడి, ఈడ్పు మొదలైన శక్తులు అమితం[illegible] ఏర్పడతాయి. దీనివల్ల భూకంపాలు బయ[illegible] దేరతాయి. సాధారణంగా ఇవి వాతావర[illegible] ఉష్ణోగ్రత మార్పులవల్ల, భూమ్యాకర్షణ శ[illegible] వల్ల ఏర్పడుతున్నాయని మరోవాదం. ఏ వా[illegible] మైనా భూగర్భం నిలకడ లేకుండా అస్థిరం[illegible] ఉంది. ఇది సుస్థిరత్వం పొందడానికి జరి[illegible] ప్రయత్నంలో భూకంపాలు ఏర్ప[illegible] తున్నాయి.

"మనలను పొగిడేవారే మనకు నిజమైన అపకారులు."

# కేరళదేశపువర్షారణ్యాలు

డా. కె.ఎన్. ప్రసాద్

పశ్చిమ కనుమలలో మానవమాత్రుడు లోప లకు ప్రవేశించడానికే వీలులేని దట్టమైన ఉష్ణమండలపు వర్షపు టడవులు విస్తారంగా ఉన్నాయి. ఇదే మహాకావ్యం రామాయణంలో పేర్కొనబడ్డ "సహ్యాద్రి." భారతదేశపు ఈ పశ్చిమ తీరపు అడవులకు కొన్ని విశిష్ట లక్షణాలు ఉన్నాయి. పశ్చిమ కనుమలు సముద్రమట్టానికి 4,000 అడుగుల ఎత్తుగా, సుమారు 1,000 మైళ్ళ పొడవుగా ఉన్నాయి.


వర్షపుటడవి దృశ్యం

వీటిలో 8,650 అడుగుల ఎత్తుగల దొడ్డబెట్ట, 8,380 అడుగుల ఎత్తుగల మాకుర్తి, 8,218 అడుగుల ఎత్తుగల వెంబాడిషోలా ఎత్తయిన ఉన్నత శిఖరాలు.

ఈ పర్వతశ్రేణిలో కేరళకు చెందిన ఇడుక్కి, పాలఘాటు జిల్లాలలో సైలెంటు వాలీ (నిశ్శబ్దపు లోయ), క్రొత్త అమరాం బాళం అనే రెండు సాటిలేని ఉష్ణమండలపు వర్షపుటడవులు చాలా ముఖ్యమైనవి. సాధా రణంగా కీచుమని శబ్దం కలిగించే 'సికడాస్' కీటకాలు ఇక్కడ లేకపోవడం వల్ల ఈ అడ వులకు నిశ్శబ్దపు టడవులని పేరు సార్థక మైంది. ప్రపంచంలో ఏ ఇతర ప్రదేశాల లోను కనిపించని జంతుజాలంతో, అపూర్వ మైన వృక్షసంపదతో ఈ సతత హరితా రణ్యాలు శోభిల్లుతూంటాయి. ఇక్కడ చాలా అరుదుగా కన్పించేవి — సింహపు తోక కోతులు. నీలగిరి లాంగూరులు, టోపీ కోతులు, ఎగువశ్రేణిలో నీలగిరి థార్‌లు నివ సిస్తాయి. చిన్న చిన్న క్షీరదాలు కూడా ఉంటాయి. రంగురంగుల సీతాకోక చిలుకలు, అరుదైన రాస్‌జోరా, గ్రాచేపలు, అవయ వాలు లేని సిసిలియన్ కప్పలు కూడా

## పార్లమెంటులో చెరసాల

బ్రిటిష్ పార్లమెంటు బెల్‌ఫ్రే (బిగ్ బెన్ అమర్చిన) భవనం మొదటి అంతస్థులో ఉండే కొట్టు గత 100 సంవత్సరాలుగా తాళం వేసే ఉంది. పార్లమెంటు నిబంధన లకు వ్యతిరేకంగా నేరాలు చేసిన పార్లమెంటు సభ్యులకు పార్లమెంటే న్యాయవిచారణ సలిపి కఠినశిక్ష విధించి వారిని ఈ కొట్టులో నిర్బంధిస్తారు. నార్త్ హాంప్టన్‌కు క్రొత్తగా ఎన్నుకోబడిన బ్రాడ్‌లాఫ్ ప్రమాణాన్ని స్వీకరించడానికి నిరాకరించినందుకు ఆఖరు సారిగా 1880 వ సం.లో ఇక్కడ నిర్బంధిం చారు. ఇంటికంటె గుడి పదిలమన్నట్టు అన్ని సౌకర్యాలు గల ఈ కొట్టులో ఇతడు ఒక

"అనుమానాలు తొలగితే గానీ సంబంధాలు కుదుటబడవు."

ఉన్నాయి. మానిటర్స్ వంటి బల్లులు, త్రాచు (King Cobra), క్రెయిట్లు, వైపర్స్, కొండ చిలువలు వంటి పాములు విస్తారంగా వనిసిస్తాయి.

క్రొత్త అమరాంబాళం రిజర్వు అడవులలో చోళనాయకులు, పథినాయకులు అనే




రెండు ఆదిమజాతులవారు నివసిస్తున్నారు. ముఖ్యంగా ఎగువ లోయలలో నివసించే ఈ జనులకు ఇక్కడ అడవులలో దొరికే వస్తువులే జీవనాధారం. ఆహారాన్ని సేకరించుకోడం, అడవి జంతువులను వేటాడడం వారి నిత్యజీవనం. వీరు సాధారణంగా అనాగరికులుగా అక్షరజ్ఞానం లేకుండా చాటుమాటుగా ఎవరికీ కనిపించకుండా బెదిరిపోతూ ఎలెయిస్ (Alais) అనే కొండగుహలలో నివసిస్తారు. వీరు కన్నడం, తమిళం, మలయాళం ద్రావిడభాషలు కలసిన ఒక మిశ్రమ భాష మాట్లాడుకుంటారు. దిగువ శ్రేణిలో సతత హరితారణ్యాలలో పథినాయక జాతివారు నివసిస్తారు. సాయివిల్లా, మాంచేరి, సరంపికాల్, మంజకడవు గ్రామాలలో సుమారు 200 కుటుంబాల పథినాయక జాతివారు నివసిస్తున్నారు. చోళనాయక జాతివారి సాంఘిక జీవితం చాలా విచిత్రంగా ఉంటుంది. వీరి వసతులు "జన్మము" అనబడే ప్రత్యేక ప్రదేశాలు. ఈ జన్మము ఒక నదిని బట్టి వచ్చిన పేరు. ఇదేవిధంగా చోళనాయకులువారు నివసించే ప్రత్యేక గుహనుబట్టి వారికి పేర్లు ఏర్పడ్డాయి. పచపర కుంగనులు అంటే పచపర గుహలో నివసించే కుంగనులు. ఈ కొండ గుహలు వీరికి తీవ్రమైన ఋతుపవనాలనుండి, క్రూరమైన అడవి ఏనుగుల నుండి సంరక్షణను కలిగిస్తాయి. ఏ గుహలోనైనా నివసించే వారిలో ఎవరైనా మరణిస్తే వారిని అక్కడే ఆ గుహలో భూస్థాపితం చేస్తారు. వెంటనే అక్కడ నివసించేవారు ఆ గుహను వదలి ఇంకో గుహలోకి చేరతారు. ఈ ఆదిమజాతి ముఖ్య నాయకుడు జన్మకారన్. ఈ నాయకుడికే కర్మకాండలకు సంబంధించిన అధి

## భావపరిచయపోటీ

(ఫిబ్రవరి 1987)

"మనుష్యుల వలనే మనకు భయం,
జంతువులే మనకభయం!"

—కట్టోజు రఘురామ్, అజ్జరం

* * *

"విశ్వాసంలో మనిషి కన్న
శునకమే మిన్న."

—జి. గురునాథబాబు, ఆదోని.

* * *

"మానవుల్లో మానవత్వం మరుగునపడుతోంది
జంతువుల్లో విశ్వాసం మెరుగుపడుతోంది."

—ఎన్. కళ్యాణసుందర్, గుంటూరు.

"ఆత్మస్తుతి ఉన్నచోట పరనింద ఉండి తీరుతుంది."

కారాలు అన్నీ ఉంటాయి. వీరు దుంపలు, వేళ్ళు. పళ్ళు, పప్పులు, గింజలు, ఆకులు, తేనె వెదుకు తూ అడవులలో సంచరిస్తారు. వీరు అతి నైపుణ్యంగా అడవి పందులను, ముళ్ళపందులను వేటాడి చంపగలుగు తున్నారు. వీరు వస్తు మార్పిడి విధానంలో


నీలగిరి లాంగూర్

వ్యాపారం కొనసాగించుకుంటూ పథినాయకు లతో సంపర్కం కలిగించుకుంటారు. క్రొత్త అమరాంబాళంలో ఒక్కొక్కటి 50 మొదలు 150 చ.అ. వైశాల్యముండే 50 ఎలెయిన్ గుహలున్నాయి. ఒక్కొక్క గుహలో 3 కుటుంబాలవారు నివసిస్తారు. వీరి గుహలు చాలా అనారోగ్యకరంగా, అనాగరీకంగా ఉంటాయి. ఎప్పుడూ చెమ్మగా ఉంటాయి.

అడవులలో విస్తారంగా లభించే అడవి తేనెను వెదురు గొట్టాలలో నిలవచేసు కుంటారు. పళ్ళు, దుంపలు, వేళ్ళు మొదలైన అడవులలో దొరికే వస్తువులను పొన్నికొడై అనే బుట్టలో పెట్టుకుంటారు. ఒక్కొక్క బుట్టలో సుమారు 40-50 కి.గ్రా.ల సరకు పడుతుంది.

కాలం ఎంతో మారుతూ ముందుకు సాగి పోతున్నా వీరిలో ఎంతమాత్రం మార్పు రాలేదు. అర్ధనగ్నంగా సంచరించే ఈ ఆదిమ వాసులలో పరిశుభ్రతలేదు. అనేక రోగాలతో అనారోగ్య పరిస్థితులతో బాధపడుతూంటారు. ముఖ్యంగా అనాగరిక జీవితవిధానం, మరియు అడవి ఏనుగుల బెడదవల్ల వీరిలో అధికంగా మరణాలు సంభవిస్తూంటాయి. అట్టపాడిలో నివసించే కురుంబులు, మాదిగలు అడవులలో లభించే ఏలకులు, అల్లం, మిరియాలు మొద లైన సువాసన ద్రవ్యాలు వ్యాపారం చేసు కుంటూ జీవిస్తారు. ఈ నిశ్శబ్ద లోయలోను, క్రొత్త అమరాంబాళంలోను అడవులు చాలా అపూర్వమైన కీకారణ్యాలు. ఈ అరణ్యాలకు, వీటిలో నివసించే ఆదిమవాసులకు సంరక్షణ కలిగించాలి.

## ప్రపంచం అసత్యం

చీకటిలో నడిచిపోతూంటాం. దారిలో ఒక తాడు పడి ఉంటుంది. దాన్ని చూడ్డం తోటే పాము అనుకుంటాం. గుండె జల్లు మంటుంది. వాస్తవానికి అది పాము కాదు. త్రాడే. ఇక్కడ సర్ప భ్రమకి రెండు కారణాలు. ఒక్కటి అక్కడ త్రాడు ఉండటం. రెండవది అది త్రాడు అనే తెలివి మనకు లేకపోవడం. త్రాడు తన స్వరూపాన్ని విడువలేదు. ఆ త్రాడే సర్పాన్ని భాసింప జేస్తుంది. అది త్రాడు అని తెలిస్తే పాము మిథ్య. అలాగే బ్రహ్మజ్ఞానం పొందితే ప్రపంచం అసత్యం. అసలు త్రాడు లేదను కుంటే మనకు భ్రమ ఉండదు. త్రాడు ఉంది. అది త్రాడు అని స్పష్టంగా తెలిస్తే భ్రాంతికి అవకాశం ఉండదు. —తాడూరి

"పరస్పర అనుమానాలు అపనమ్మకాలు
మనస్సుల మధ్య అడ్డుగోడలుగా లేస్తాయి."

# యువతరానికి సలహాలు

కూచి నరసింహం పంతులు

ఇండ్లలోగానీ ఆఫీసులో గానీ, అన్ని ముఖ్యమైన విషయాలను నమ్రతతో, విధేయతతో, భక్తితో, గౌరవంగా ఏకాగ్రతతో మొట్ట మొదట అనుగ్రహించమని, దారి చూపించమని భగవంతునికి మ్రొక్కుకో.

ఏ వ్యాపారంలోనైనాసరే హృదయ పూర్వకంగా, నీతిగా, నిష్కాపట్యంగా, న్యాయంగా ప్రవర్తించు. ప్రాపంచిక విషయాలలో నీకు ఉపకరించేది న్యాయశీలత అని గుర్తించుకో.



కూచి నరసింహం పంతులు

ఒకేసారి వివిధ ఉద్యమాలతో తికమకలు పడిపోయి నీ శక్తిసామర్థ్యాలను వృధా చేసుకోకు. రెంటికి చెడ్డ రేవణుడవు అయిపోతావు. చేయదలచుకున్నది ఒక్కటీ పూర్తిగా సక్రమంగా నెరవేర్చుకోడం ఉత్తమం; శ్రేయోదాయకం.

నీ సంస్థయొక్క సంక్షేమం, సౌభాగ్యం, గౌరవమర్యాదలను నిలబెట్టుకోడానికి సన్మార్గంలో ధర్మం తప్పకుండా శాయశక్తులా కృషి చెయ్యి. 'తక్కువ ఖర్చుతో అత్యధిక లాభాలు' పొందాలని ప్రతిజ్ఞ పట్టు.

ఒకరికి ఆదేశించే ముందు నీవు అణిగి మణిగి లొంగి ఉండటం నేర్చుకో. ఉపదేశించడం కంటే ప్రత్యక్షంగా చేసి చూపించడం అలవాటు చేసుకో.

ఆచరణ రూపకంగా మృదుమధురమైన మాటలతో, వినయ విధేయతలతో ఇతరుల సహకారం పొందగలవు. నువ్వే గొప్పవాడవు అనుకుంటూ విర్రవీగితే నీవు సాధించగలిగేది శూన్యం.

సకాలంలో పనులను నీవు నెరవేర్చుకో. తాత్సారం వద్దు. ఈ రోజు చేయవలసిన పని ఈరోజే కానివ్వు. వాయిదాలు వేసుకోకు సుమా!

ఇంకొకరికి అపకారం తలపెట్టకు. పరుషంగా మాట్లాడకు. ఇతరులతో ప్రవర్తించే

## ఆత్మ కలంకరహితం కావాలి!

నిష్కలంకమైన ఆత్మ ప్రకాశిస్తేనే తప్ప— మనస్సు, వాక్కు, కర్మ, నిగ్రహంతో జటలు ధరించి మౌనం వహించడం, తలలు బోడులు చేసుకుని వల్కలాలు ధరించడం, నిత్యస్నాన సంధ్యలతో ఉపవాసములు చేయడం, యజ్ఞ యాగాదులను ఆచరించడం నిష్ఫలములు.

—మహాభారతము

"అందంగా ఉండటం కంటే సౌందర్యాన్ని ఆరాధించగల మనస్సు ఉండటం గొప్పతనం."

ఇప్పుడు రెండుసార్లు కాదు పదిసార్లు ఆలోచించు.

అప్పులు చేసావా? వడ్డీతో సహా పైసా మిగల్చకుండా తీర్చు. వీలైనంతవరకూ అప్పులపాలు పడకు. "అప్పు తీర్చగలనా లేదా అని కాదు, ఇప్పుడు నా ఖర్చుకు సొమ్ము అవసరం" అంటారు అన్నిటికి తెగించినవారు.

లోభత్వం లేకుండా, దుబారా చేయకుండా ఉన్నదాంతో సరిపెట్టుకుంటూ నెల నెలా ఆదా చేయగలిగినంత సొమ్ము ఆదా చేసుకుంటూంటే అవసర సమయాలకు సొమ్ము అనుకూలపడుతుంది.

అత్యవసర పరిస్థితులలో నీ బంధువులలో నీకంటే అదృష్టహీనులకు కావలసిన సహాయం చేస్తూండు. ఏ కారణంచేతనైనా సహాయం చేయలేకపోయావా కనీసం వారికి ఎటువంటి అపకారం తలపెట్టకు.

నీవు యిచ్చినది నీవు మరిచిపోయినా పరవాలేదు. కాని ఇతరులవద్ద నీవు పొందిన ఎంత చిన్న ఉపకారమైనా ఎప్పుడూ మరచిపోవద్దు.

న్యాయం కోసం, సత్యం కోసం, ధర్మం కోసం ధైర్యసాహసాలతో మంచిగా పోరాడు. నీదే తప్పు అని నిర్ణయింపబడిందా? ఒప్పుకో తప్పులేదు. అదే నిజమైన ధైర్యం. అదే నీ ఘనత. అదే నీ గౌరవం.

నీ దస్తూరి నీ గుణాన్ని, నీ శీలాన్ని తెలియజేస్తుందనడంలో ఎంతో నిజం ఉంది. నీ భావాలను సక్రమంగా వివరంగా పొందుపర్చి మంచి దస్తూరీతో తెలియజేయకపోతే నీపై అధికారులు చికాకుతో చెలరేగిపోతారు. ప్రేమానురాగాలతో సామర్థ్యవంతంగా బోధించగలిగినంత, దండించి బోధించలేవు. ఆడంబరం వద్దు. మర్యాదగా మాట్లాడు. వివేకంతో ఆలోచించు. ఆహారవిషయంలో గానీ, బట్టల విషయంలోగానీ వట్టి గొప్పలకు పోవద్దు. సరళమైన సామాన్య జీవితాన్ని అలవాటు చేసుకో. అదే నీ గొప్పతనాన్ని తెలియజేస్తుంది.

మనస్సులో ఏదైనా కోరిక పుట్టిందా యోచించు. తీవ్రంగా ఆలోచించి నీచమైనదో, మహోన్నతమైనదో వివరించుకో. నీచమైనదైతే వెంటనే వదలుకో. మహోన్నతమైనదైతే ధైర్యంగా, దృఢ నిశ్చయంతో ప్రయత్నించు, వదలకు.

స్వార్థపరత్వం లేకుండా, ఆత్మాపేక్ష లేకుండా కార్యక్రమాలు కొనసాగించగలిగావా నీకంటే భాగ్యశాలి ఎవరు? ●

## ముఖచిత్రవ్యాఖ్య

(ఫిబ్రవరి 1987)

"నీ వందించిన సమైక్యస్ఫూర్తి
మానవజాతికి ఉజ్జ్వల దీప్తి."
—కె. శ్రీరాములు, అమడగూరు.

"శ్రీరామకృష్ణుని అమరవాణి
మానవాళికి తరగని జ్ఞాన నిధి."
—భమిడిపాటి అప్పల నరసింహులు,
నరసన్నపేట.

* * *

"లోకానికి నువ్వందించిన బోధనలు
నిత్యనూతన సుగంధ కుసుమాలు."
—వై. మంజులాదేవి, కడప.

"డబ్బే ముఖ్యం అనుకున్న వ్యక్తులు దాన్ని సంపాదించడంకోసం ఏ పని చేయడానికీ వెనుకాడరు." —సోమర్‌సెట్ మామ్

# కలం స్నేహితులు

(మీ పేరు, వయస్సు, చిరునామా, హాబీలు ఈ శీర్షిక క్రింద ప్రచురించబడాలంటే తగిన వివరాలతో సహా రూ. 5/-లు మనియార్డరు ద్వారా పంపండి. —సంపాదకుడు.)

1. ఎమ్.వి. ప్రసాదరావు, ఎమ్.కామ్., 23 సం.లు, ఎస్.వి.యు పి.జి. సెంటర్, రూమ్ నెం. 71, కావలి-524 202.

రేడియో వినడం, ప్రకృతి ఆరాధన, చదరంగం ఆడటం.

2. కె. సాయికుమార్. XMP డ్రైవర్, ఒల్డ్ ఎమ్. ఇ. ఎ. క్వార్టర్స్, క్వార్టర్స్ నెం. బి-4, హైదరాబాదు-500 178.

మంచి పనులు చేయడం. దేవుని పూజించడం.

3. చలం గణపతి, S/o కోటయ్య, జిల్లా పరిషత్ హైస్కూల్, మోదుకూరు (గుంటూరు జిల్లా) 522 321.

గాంధీజీ సిద్ధాంతాలను పాటించడం, మంచి స్నేహితులతో కాలక్షేపం, క్రొత్త విషయాలను తెలుసుకోడం.

4. తెంబూరు గానం, 25 సం.లు, C/o జల్లు లక్ష్మినారాయణ, బిగ్‌స్ట్రీట్, కొరసండ గ్రామం, వయా ఉప్పలాడ, (గంజాం జిల్లా) ఒరిస్సా.

కలంస్నేహం.

5. డి. రాజశేఖరరావు, 25 సం.లు, పల్లేర్లమూడి, హనుమాన్ జంక్షన్ వయా, (కృష్ణా జిల్లా) 521 105.

మనస్తత్వశాస్త్రం, రేడియో వినడం, వ్రాయడం.

6 పి. రాము, బి.కామ్., ప్రతాపగిరి వారి వీధి, రైలు పేట, గుంటూరు-522 001.

ఫోటోగ్రఫీ, పుస్తక పఠనం, కలం స్నేహం.

## జీడిపప్పు ప్రపంచ ఎగుమతి



1985వ సం. లో ప్రపంచంలో జీడిపప్పు ఎగుమతి మొత్తం 77,000 టన్నులు. ముఖ్యంగా ఎగుమతిలో పెరుగుదల దక్షిణ అమెరికాలో బ్రెజిల్‌వల్ల ఏర్పడినదే.

"ప్రోత్సహించినప్పుడు, పొగడినప్పుడు మనిషి చేయలేనిది కూడా చేయగలడు."

# కలం స్నేహితులు

(మీ పేరు, వయస్సు, చిరునామా, హాబీలు ఈ శీర్షిక క్రింద ప్రచురించబడాలంటే తగిన వివరాలతో సహా రూ. 5/-లు మనియార్డరు ద్వారా పంపండి. —సంపాదకుడు.)

1. ఎమ్. వి. ప్రసాదరావు, ఎమ్.కామ్., 23 సం.లు, ఎస్.వి.యు పి.జి. సెంటర్, రూమ్ నెం. 71, కావలి-524 202.

రేడియో వినడం, ప్రకృతి ఆరాధన, చదరంగం ఆడటం.

2. కె. సాయికుమార్. XMP డ్రైవర్, ఒల్డ్ ఎమ్. ఇ. ఎ. క్వార్టర్స్, క్వార్టర్స్ నెం. బి-4, హైదరాబాదు-500 178.

మంచి పనులు చేయడం. దేవుని పూజించడం.

3. చలం గణపతి, S/o కోటయ్య, జిల్లా పరిషత్ హైస్కూల్, మోదుకూరు (గుంటూరు జిల్లా) 522 321.

గాంధీజీ సిద్ధాంతాలను పాటించడం, మంచి స్నేహితులతో కాలక్షేపం, క్రొత్త విషయాలను తెలుసుకోడం.

4. తెంబూరు గానం, 25 సం.లు, C/o జల్లు లక్ష్మీనారాయణ, బిగ్‌స్ట్రీట్, కొరసండ గ్రామం, వయా ఉప్పలాడ, (గంజాం జిల్లా) ఒరిస్సా.

కలంస్నేహం.

5. డి. రాజశేఖరరావు, 25 సం.లు, పల్లేర్లమూడి, హనుమాన్ జంక్షన్ వయా, (కృష్ణా జిల్లా) 521 105.

మనస్తత్వశాస్త్రం, రేడియో వినడం, వ్రాయడం.

6 పి. రాము, బి.కామ్., ప్రతాపగిరి వారి వీధి, రైలు పేట, గుంటూరు-522 001.

ఫోటోగ్రఫీ, పుస్తక పఠనం, కలం స్నేహం.

## జీడిపప్పు ప్రపంచ ఎగుమతి



1985వ సం. లో ప్రపంచంలో జీడి పప్పు ఎగుమతి మొత్తం 77,000 టన్నులు. ముఖ్యంగా ఎగుమతిలో పెరుగుదల దక్షిణ అమెరికాలో బ్రెజిల్‌వల్ల ఏర్పడినదే.

"ప్రోత్సహించినప్పుడు. పొగడినప్పుడు మనిషి చేయలేనిది కూడా చేయగలడు."

# జామ-పుష్టిదాయకమైన ఫలం

డా. యు. సి. పాండే

జామపండు మన దేశంలో ప్రతిచోటా చౌకగా లభించే మంచి రుచికరమైన పండు. దీనికి ప్రత్యేక కాలం అంటూ లేదు. సంవత్సరం పొడుగునా దీన్ని పండిస్తారు. మధ్య అమెరికాలో పుట్టిన జామ నేడు ప్రపంచంలో అన్ని ఉష్ణప్రదేశాలలోను చోటు చేసుకుంది. జామపండులో విటమిను 'C' విస్తారంగా లభిస్తుంది.



జామ, మిర్టేసే (Myrtaceae) కుటుంబానికి చెందినది. అందానికి ఇండ్లలో పెంచే అనేక రకాల మొక్కలు, పండ్లచెట్లు ఈ కుటుంబానికి చెందినవే. వృక్ష శాస్త్రంలో దీన్ని (Psidium guajava) ప్సిడియం గువాజావా అంటారు.

జామచెట్టు గుబురుగా పెరిగే చిన్న వృక్షం. సాధారణంగా 20 మొదలు 30 అడుగుల ఎత్తు పెరుగుతుంది. చెట్టుకి సన్నపాటి కొమ్మలు, రెమ్మలు బయలుదేరతాయి. చెటు కాండంపైన పొలుసులు పొలుసులుగా బెరడు వివిధ రంగులలో ఉంటుంది. పువ్వులు తెల్లగా వుంటాయి. ఇవి ఆకుల తొడిమల పక్కలనుంచి గుత్తులు గుత్తులుగా బయలుదేరతాయి. ఒక్కొక్క గుత్తికి 2 మొదలు 5 దాకా పువ్వులుంటాయి. జామ జాతిని అభివృద్ధిచేసి పెద్దపెద్ద రకాలను కూడా పండిస్తున్నారు. 1 మొదలు 4 అంగుళాల పొడవు, 1 మొదలు 2 అంగుళాల వెడల్పు ఉంటాయి. పండ్లలోపల కండ సాధారణంగా తెల్లగా ఉంటుంది. కొన్ని కొన్ని రకాల పండ్లలోపల కండ ఎర్రగా ఉంటుంది. కాయలోపల చిన్నచిన్న గింజలు చాలా ఉన్నా, ఇప్పుడు గింజలులేని పండ్లను కూడా పండిస్తున్నారు.

(మిగతా 64 వ పేజీలో)

## మీరైతే...?

(ఫిబ్రవరి 1987)

'దేహంకంటె పవిత్రమైన దేవాలయం లేదు" అంటే')

"మంచి మనసును మించిన దైవమూ
లేదంటాను!"

—సోనాపురం మధుసూదనరావు,
వసుంధర.

* * *

"మనః పూజారినై
ఆత్మారాముని అర్చిస్తా."

—కె. శ్రీరాములు, అమడగూరు.

"సద్గుణములకు కృషి చేయు మనిషి సద్గుణుడు కాడు.
దుర్గుణములు లేకపోవుట సద్గుణము కాదు."

# పేరు మరచిపోకుండా ఉండాలంటే?

ఒకరి పేరు మరచిపోకుండా జ్ఞాపకం పెట్టుకోడానికి కొన్ని సూచనలు:

1. వ్యక్తి పేరు వినేటప్పుడు పూర్తిగా జాగ్రత్తగా సరిగ్గా మనసు దానిమీదే లగ్నం చేసి వినాలి. సగానికి సగం మంది పరధ్యానంగా వింటారు. మనస్సును ఇతర విషయాల మీదికి మళ్ళించకుండా శ్రద్ధగా వినాలి



2. ఒకసారి పూర్తిగా విన్న పేరు జ్ఞాపకం పెట్టుకోడానికి సాధ్యమైనన్నిసార్లు పేరు మననంచేసుకో. మననం చేసుకోవడం వల్ల జ్ఞాపకశక్తి 30 శాతం అధికం అవడానికి అవకాశముంది.

3. వ్యక్తి ముఖవైఖరిని గమనించు. హావభావాలను జాగ్రత్తగా చూడు. వ్యక్తి, ధోరణి, ఫక్కీ పరిశీలించు. ఆ ముఖవైఖరితో హాస్యంగా అపూర్వమైన భావనాశక్తితో అతడి పేరును సమన్వయించి ముడిపెట్టుకో. మనస్సులో భావాల పరస్పరానుబంధం పెంచుకో. సాధారణంగా మనం ముందు వ్యక్తి ముఖాన్ని జ్ఞాపకం చేసుకుంటాం. తరువాత పేరు జ్ఞాపకం చేసుకోడానికి తంటాలు పడతాం. వ్యక్తి ప్రత్యేక అలవాట్లకు చాంధసాలకు పేరు ముడిపెట్టి మెదడులో ఆయా కేంద్రాలను చైతన్యం చేసుకుంటే పేరు త్వరగా తప్పులేకుండా జ్ఞాపకం చేసుకోగలుగుతాం.

4. వ్యక్తి నిష్క్రమించిన తరువాత పేరు తిరిగి ఒకసారి పునర్విమర్శన చేసుకో. మనోఫలకంమీద వ్యక్తి ముఖవైఖరి లక్షణాలు ప్రతిబింబించుకో. రాత్రి పడుకునే ముందు తిరిగి జ్ఞాపకంచేసుకో.

5. 'నాకు జ్ఞాపకశక్తిలేదు' అనే భావాన్ని మనస్సులో చేరనీయక సక్రమంగా మానసిక విశ్రాంతి తీసుకుంటూ ఉండు. మనస్సును ప్రసన్నంగా ఉంచుకో. నాకు బ్రహ్మాండమైన జ్ఞాపకశక్తి ఉందని మాటిమాటికి సూచించుకుంటూ ఉండాలి. నీమీద నీకు నమ్మకం కలిగించుకో. ఏ రోజుకారోజు వ్యక్తులను, వ్యక్తుల పేర్లను అతిసులభంగా జ్ఞాపకం పెట్టుకోగలుగుతున్నాను అనుకో. జన్మలో పేరు మరచిపోలేవు.

('హిప్నోటిక్ బుల్లిటిన్' సౌజన్యంతో)

## భారతదేశంలో యువత

భారతదేశం మొత్తం జనాభాలో సుమారు 20 శాతం అంతా యువతరానికి చెందినదే. యునైటెడ్ నేషన్స్ వారి అంచనా ప్రకారం ప్రపంచంలో యువ జనాభా 1000 మిలియను దాటింది.

"కర్మలోపము లేనివానికి కార్యభంగము లేదు."

# మీకు తెలుసా?

**115 టెస్ట్‌మాచ్‌లలో ఆడిన మొట్ట మొదటి క్రీడాకారుడు:**



ఎడ్జ్‌బేస్టన్ టెస్టులో ఆడిన తరువాత సునీల్ గవాస్కర్ 115 టెస్ట్ మేచ్‌లలో పాల్గొన్న ప్రపంచంలో మొదటి వ్యక్తి. ఇంతకు ముందు ఇంగ్లండుకు చెందిన కోలిన్ కౌడ్రే 114 టెస్టులలో ఆడి రికార్డు స్థాపించాడు.

* * *

**150 దేశాలు ప్రపంచ బ్యాంకు సభ్యులు:**

ప్రస్తుతం 150 దేశాలు ప్రపంచ బ్యాంకు సభ్యులుగా ఉన్నాయి. ఇటీవలే పోలండ్ 150 వ సభ్యత్వాన్ని పొందింది.

* * *

**1986 ప్రపంచ కప్ ఫుట్‌బాల్ ఛాంపియనులు:**

అర్జెంటీనా దేశీయులు 1986 ప్రపంచ కప్ ఫుట్‌బాల్ ఛాంపియనులు. మెక్సికో నగరంలో జరిగిన చివరిపోటీలో అర్జెంటీనా పశ్చిమ జర్మనీని 3-2 గోల్సుతో ఓడించింది.

* * *

**ప్రపంచంలో మొట్టమొదటి 'ఎక్స్‌ట్రాటెరెస్ట్రియల్ ప్లానెటేరియం':**

ప్రపంచంలో మొట్టమొదటి ఎక్స్‌ట్రా టెరెస్ట్రియల్ ప్లానెటేరియం భూమిమీద (ఖగోళ ప్రతిరూపం) జపానులో నెలకొల్పబడింది.

**వజ్రనగరం:**



పశ్చిమ యూరప్‌లో నెదర్‌లాండ్స్‌లో గల ఆమ్‌స్టెర్‌డాం 'వజ్రనగరం' (City of Diamonds) అని ప్రసిద్ధి పొందింది.

* * *

**పార్శీల యజ్ఞోపవీతం:**

పార్శీలు ధరించే యజ్ఞోపవీతంలో 72 దారాలు (పోగులు) ఉంటాయి.

"పరులు చెప్పుదానికి చెవులొగ్గుట కన్న
స్వతంత్రముగా ఆలోచించుట మిన్న."

# మీకు తెలుసా?

**115 టెస్ట్‌మాచ్‌లలో ఆడిన మొట్ట మొదటి క్రీడాకారుడు:**



ఎడ్జ్‌బేస్టన్ టెస్టులో ఆడిన తరువాత సునీల్ గవాస్కర్ 115 టెస్ట్ మేచ్‌లలో పాల్గొన్న ప్రపంచంలో మొదటి వ్యక్తి. ఇంతకు ముందు ఇంగ్లండుకు చెందిన కోలిన్ కౌడ్రే 114 టెస్టులలో ఆడి రికార్డు స్థాపించాడు.

* * *

**150 దేశాలు ప్రపంచ బ్యాంకు సభ్యులు:**

ప్రస్తుతం 150 దేశాలు ప్రపంచ బ్యాంకు సభ్యులుగా ఉన్నాయి. ఇటీవలే పోలండ్ 150 వ సభ్యత్వాన్ని పొందింది.

* * *

**1986 ప్రపంచ కప్ ఫుట్‌బాల్ ఛాంపియనులు:**

అర్జెంటీనా దేశీయులు 1986 ప్రపంచ కప్ ఫుట్‌బాల్ ఛాంపియనులు. మెక్సికో నగరంలో జరిగిన చివరిపోటీలో అర్జెంటీనా పశ్చిమ జర్మనీని 3-2 గోల్సుతో ఓడించింది.

* * *

**ప్రపంచంలో మొట్టమొదటి 'ఎక్స్‌ట్రాటెరెస్ట్రియల్ ప్లానెటేరియం':**

ప్రపంచంలో మొట్టమొదటి ఎక్స్‌ట్రా టెరెస్ట్రియల్ ప్లానెటేరియం భూమిమీద (ఖగోళ ప్రతిరూపం) జపానులో నెలకొల్పబడింది.

**వజ్రనగరం:**



పశ్చిమ యూరప్‌లో నెదర్‌లాండ్స్‌లో గల ఆమ్‌స్టెర్‌డాం 'వజ్రనగరం' (City of Diamonds) అని ప్రసిద్ధి పొందింది.

* * *

**పార్శీల యజ్ఞోపవీతం:**

పార్శీలు ధరించే యజ్ఞోపవీతంలో 72 దారాలు (పోగులు) ఉంటాయి.

"పరులు చెప్పుదానికి చెవులొగ్గుట కన్న
స్వతంత్రముగా ఆలోచించుట మిన్న."

ప్రపంచంలో అతి ప్రాచీనమైన దేశభక్తి గేయం:

ప్రపంచంలో అతి ప్రాచీనమైన దేశ భక్తి గేయం జపానుదేశపు కిమిగాయో (Kimigayo). ఇందులో పదజాలం 9 వ శతాబ్దానికి చెందినది.

* * *

D.L.O. అంటే ఏమిటి?:

DLO, ENT (ఇయర్, నోస్, త్రోట్) వైద్యనిపుణుడు. లేరింగాలజీ మరియు ఓటాలజీలో పొందే డిప్లొమాను D.L O అంటారు.

* * *

భారతదేశంలో అతి ప్రాచీన హాకీ పందెం:



బైటన్ (Beighton) కప్ హాకీ పందెం భారతదేశంలో అతి ప్రాచీనమైనది.

* * *

వెస్ట్ ఇండీస్ క్రికెట్ ఆటలో మూడు 'W' లు:

వాల్‌కాట్ (Walcott) వొరెల్ (Worrell), వీక్స్ (Weekes) వెస్ట్ ఇండిస్ క్రికెట్‌లో సుప్రసిద్ధ మూడు 'W' లు.

* * *

అశ్వం జ్ఞాపకార్థం నిర్మింపబడిన నగరం:



అలెగ్జాండర్ ది గ్రేట్ ఆఫ్ మాసిడోన్ బుసెఫలా (Bucephala) నగరాన్ని తన గుఱ్ఱం బుసఫలాస్ జ్ఞాపకార్థం నిర్మించాడు.

* * *

బ్లూబాటిల్ ఎవరు?

బ్లూ యూనిఫారం ధరించే ఆంగ్లేయ పోలీసును బ్లూ బాటిల్ అంటారు.

బ్లాక్ బాక్స్ రంగు:

విమానంలో 'బ్లాక్‌బాక్స్' నారింజ రంగులో వుంటుంది.

తేనెటీగకు అయిదు కళ్ళు:

తేనెటీగకు తలకు రెండువైపుల కుడి ప్రక్క ఎడమప్రక్క ఒక్కొక్క కన్ను, క్రింద మూడు కన్నులు ఉంటాయి.

"సర్దుబాట్లు లేకుండా సరిపెట్టుకోకుండా సంఘ జీవితం సాగదు."

# ప్రపంచంలో సుప్రసిద్ధ హోటళ్ళు

సిల్వియా మాక్ నెయిర్

ప్రపంచంలో 'మొదటిరకం లేక డీలక్స్' కంటే 'సుప్రసిద్ధం' అని చెప్పడంలో ఒక ప్రత్యేకత ఉంది. సుప్రసిద్ధం అని పేరు పొందాలంటే అత్యుత్తమమైన నిర్మాణ సామగ్రితో, అన్ని హంగులతో, అన్ని అనుకూలాలతో నవనాగరీకంగా నిర్మింపబడి ఉండాలి. ఒక ప్రసిద్ధిపొందిన నగరంలోగానీ, అపూర్వమైన సహజసుందర వాతావరణంలో గానీ ఇది ఏర్పాటై ఉండాలి. అంతేగాక క్రమ అనుభవంగల పరిచారక బృందం



ఉండాలి. ఇటువంటివే సుప్రసిద్ధ హోటళ్ళు. ప్రపంచంలో ప్రతీ సుప్రసిద్ధమైన హోటలుకి ఒక ప్రత్యేకత ఉంది:

పెద్దపెద్ద విశాలమైన కోర్టు యార్డులతో, అరమిలియనుకు పైగా రకరకాల మొక్కలతో, చెట్లతో, అందమైన వృక్షవాటికలతో, ప్రకృతి సౌందర్యంతో సాటిలేని సుప్రసిద్ధ హోటలు - హవాయ్ బిగ్ ఐలండ్స్‌లో 'కామ్యూలా'లో నిర్మింపబడిన మౌనా కీ బీచ్ హోటలు. ఇక్కడ థాయ్‌లాండ్ బంగారు పూతగల నల్లలక్క బౌద్ధ విగ్రహాలు, భారత దేశపు అపూర్వ కంచు విగ్రహాలు ఇతడి బొమ్మలు, న్యూగినీ కొయ్యసామానులు. జాంజిబార్ ప్రాచీన భోషాణము, హవాయ్‌లో చేతితో తయారైన అందమైన క్విల్టు మొదలైన వాటిని ఇక్కడ అతిధులు చూచి ఆనందించవచ్చు.

ఆధునిక ఒత్తిడులకు దూరంగా అతి గంభీరంగా ప్రశాంతంగా ఉండేది ఐర్లండ్‌లోని ఆష్‌ఫర్డ్ కేసిల్ హోటలు. చాలాభాగం 19వ శతాబ్దంలో నిర్మించబడినా 13వ శతాబ్దంలో నిర్మించబడిన కోట శిథిలాలు ఇక్కడ ఉన్నాయి. ఇది 1,620 హెక్టేరుల వన్య మృగాల అడవులతో, వేటకు అనుకూలమైన 11,000 హెక్టేరుల ప్రత్యేక వేట వినోదపు అడవులతో అతిగంభీరంగా, మహాద్భుతంగా ఉంటుంది. గొప్పగొప్ప ఆటగాళ్ళకు, క్రీడాకారులకు ఇది ముఖ్యకేంద్రం. నూతన వధూవరుల హనీమూనుకు ఆదర్శవంతమైన ప్రదేశం.

## శాస్త్రజ్ఞులు 200 మిలియను సంవత్సరాలనాటి అవశేషాలను కనుగొన్నారు

ఉత్తర అమెరికా 'మెయిన్' ఉత్తర తీరంలో ఫండీ అఖాతంలో 200 మిలియను సం. ల నాటి 1,00.000 శిలాజాలను కనుగొన్నారు. చరిత్రలో అతి ముఖ్యమైన కాలానికి చెందిన బ్రహ్మాండమైన ప్రాక్ జంతువు డినాసరస్‌కు చెందినవే ఈ అవశేషాలన్నీ.

"కాంక్షించకుండినను ఫలము చేకూరును"—
ఇదే కర్మసిద్ధాంతంలో కిటుకు.

తూర్పు ఆఫ్రికా కెన్యా నాన్యుకీలో మౌంట్ కెన్యా సఫారీక్లబ్ మరో సుప్రసిద్ధమైన హోటలు. ఆధునిక సౌకర్యాలతో మిక్కిలి ఎక్కువ విలాసవంతంగా ఉంటుంది. సుమారు పాతిక సంవత్సరాలకు ముందు హాలీవుడ్ ఆక్టరుగా ప్రసిద్ధిపొందిన విలియం హోలెన్డ్ దీన్ని కట్టించాడు. ఈ హోటలులో జీవితం ఒక మరపురాని అనుభూతి. ఇది భూమధ్య రేఖకు చాలా దగ్గరగా ఉన్నా ఇక్కడ వాతావరణం ఎంతో ఆహ్లాదకరంగా చల్లగా ఉంటుంది.

ప్రపంచ ప్రఖ్యాతి పొందిన మహనీయులెందరెందరో అభిలషించేది అమెరికా న్యూయార్కు నగరంలోని రీజెన్సీ హోటలు. దీనికి చేరియున్న పార్క్ అవెన్యూ హోటలులో ప్రపంచ స్థాయిలో వ్యాపారం కొనసాగుతుంది. అత్యంత ఉత్సాహంతో, ఉల్లాస పూరితంగా ఉండే ఈ హోటలు విశ్రాంతికి, విరామానికి పెట్టినది పేరు.

హాంగ్‌కాంగ్ నగరంలో ముమ్మరంగా వ్యాపారం జరిగే విపణి వీధిలో ఉన్న మాండరిన్ హోటలు సుప్రసిద్ధమైనది. ప్రశాంతమైన వాతావరణంలో అత్యుత్తమమైన సేవా సౌకర్యాలతో తులతూగుతూంటుంది. అపూర్వమైన కళాఖండాలతో, ఫర్నిషింగులతో, విశ్రాంతిగా ఆధ్యాత్మిక సాధనకు అనువుగా వుంటుంది. ఈ హోటలులో 25వ అంతస్తులో ఉన్న మాన్ వాహ్ రెస్టారెంటులో ప్రత్యేక కాంటోనీస్ వంట విధానంలో చేయబడిన ప్రత్యేక వంటకాలు, తినుబండారాలు లభిస్తాయి.

బాంగ్‌కాక్ (థాయ్‌లాండ్) లో ఓరియంటల్ హోటల్‌కు ఒక ప్రత్యేక ఆకర్షణ ఉంది. చరిత్ర నిర్మాతలు—జోసెఫ్ కానార్డ్, సామర్‌పెట్ మామ్, నోయెల్ కవార్డ్, జేమ్స్ మిచెనెర్, గ్రహాంగ్రీన్ మొదలైన ప్రఖ్యాతి పొందిన పురుషులతో సంబంధపడి ఉంది. సుమారు నూరు సంవత్సరాల పురాతనమైనదైనా అంతర్జాతీయ ప్రయాణీకులు అందరూ మెచ్చిన సుప్రసిద్ధ హోటలు ఇది. ప్రయాణీకులు బాంగ్‌కాక్‌లో ఎక్కడ బసచేసినా, ఒక్కసారి ఇక్కడ నార్మాండీ గ్రిల్ రెస్టారెంటులో భోజనం రుచిచూసే బయలుదేరతారు.

## కంఠపాఠం చేసుకోవాలని బాధపడను




ఒకసారి ఆల్బర్ట్ ఐన్‌స్టయిన్‌ని ఒకరు అతడి టెలిఫోను నంబరు ఏమిటి అని అడిగారు. ఐన్‌స్టయిన్ దానికి "డైరెక్టరీ చూడాలి. సులభంగా ఇంకో చోట లభించే విషయాన్ని కంఠపాఠం చేసుకొని జ్ఞాపకం ఉంచుకోవాలని బాధపడను" అన్నాడు.

"తన్నుతాను రక్షించుకోలేని సమయంలో మానవుడు
అహంకారాన్ని అడ్డువేసుకుని జీవిస్తూంటాడు."

ఫిలిప్పైన్స్ మనిలాలో సుప్రసిద్ధ హోటలు మనిలా హోటలు. 38 మీటర్ల పొడవు, ఏడున్నర మీటర్ల వెడల్పుగా పాల రాతితో కట్టబడిన హోటలు. పెద్ద పెద్ద స్తంభాలు, ఆర్చిలు, స్పానిష్ దీపాలు, కర్ర నగిషీలు, ఇత్తడి, గాజు. ఆలుచిప్పలతో తయారైన రకరకాల షాండిలీర్ దీపాలతో కళకళ లాడుతుంటుంది. దీనిని దర్శించిన యువరాజులు, మహారాజులు, వ్యాపారస్థులు, రాజకీయ నాయకులు ఇచ్చటి సర్వీసు సౌక ర్యాన్ని గొప్పగా పొగిడారు.

మాడ్రిడ్ (స్పెయిన్) లోని హోటల్ రిట్జ్ అతి పురాతనమైనది. 75 సం॥ల నాటి సాంప్రదాయంతో లండన్ లేక పారిస్‌లో గల హోటళ్ళకు ఏ మాత్రం తీసిపోదు. సాధారణంగా సాయంకాలం 5 గంటల తరువాత మాడ్రిడ్ రాజవంశీయులు, భాగ్య వంతులు ఇక్కడ చేరుతుంటారు. ప్రతీ గెస్ట్ రూమ్ ప్రత్యేకంగా అలంకరించబడి ఉంటుంది. తెల్ల పాలరాతితో నిర్మించబడిన ఈ హోటల్ గదులలో రకరకాల పువ్వులు అలంకరించబడి ఉంటాయి.

స్పెయిన్ లియాన్‌లో 400 సం.ల దీర్ఘ చరిత్రలో ఒకప్పుడు కాన్వెంటుగా, హాస్టల్‌గా, చెరసాలగా ఉండిన హోటల్ సాన్ మార్కోస్ నేడు సుప్రసిద్ధ హోటలు. దీని నిర్మాణాన్ని 16 వ శతాబ్దంలో స్పెయిన్ పరిపాలకులైన ఫెర్డినాండ్, ఇజబెల్లా ప్రారం భించారు. అనేక పురాతన వస్తువులతో, తెరలతో, 2,000 కు పైగా అపూర్వమైన వర్ణ చిత్రాలతో ఈ హోటలు అత్యంత శోభాయమానంగా ఉంటుంది.

ప్రపంచంలో ఏ మూల నుంచి వచ్చినా ప్రయాణీకులకు అన్ని సౌకర్యాలతో అతిది మర్యాదలను కలిగించే సుప్రసిద్ధ హోటళ్ళు ప్రపంచంలో ఇవి కొన్ని. పాతవో, కొత్తవో సముద్రపు ఒడ్డున, లేక నగరం మధ్యన ఉన్న అందమైన ఈ హోటళ్ళన్నీ స్మరించ దగినవే.

## ప్రపంచంలో బ్రహ్మాండమైన నగరాలు



ప్రస్తుతం 18.1 మిలియను జనాభా గల మెక్సికో నగరం 2000 సం. నాటికి 26.3 మిలియను జనాభాతో ప్రపంచంలో బ్రహ్మాండమైన నగరంగా రూపొందుతుంది. 24 మిలియనుతో బ్రెజిల్‌లోని సావోపాలో, 17.1 మిలియనుతో జపానులో టోకియో - యోకహామా, 16.6 మిలియనుతో కలకత్తా, 10 మిలియనుతో గ్రేటర్ బొంబాయి ఇతర బ్రహ్మాండమైన నగరాలుగా రూపొందు తాయి.

('1986 వ సం.రం ప్రపంచ జనాభా రిపోర్టు - యునైటెడ్ నేషన్స్')

"ఒకటికి ప్రక్క సున్నలు చేర్చిన కొద్దీ సంఖ్య పెరుగునట్లు సద్గుణాలు చేరిన కొద్దీ వ్యక్తి ఔన్నత్యం పెరుగుతుంది."

సోవియెట్ యూనియన్‌కి భారతదేశపు దౌత్యాన్ని వహించింది. 1949_52 వ సం.లో అమెరికాకి దౌత్యం వహించి, 1954_61 సం.లలో బ్రిటనుకి హైకమిషనర్ పదవిని అధిష్ఠించిన సాధ్వీమణి.

* * *

జాన్‌మాస్టర్స్ ప్రఖ్యాత ఆంగ్లేయ రచయిత. 'భవాని జంక్షన్, నైట్‌రన్నర్స్ ఆఫ్ బెంగాల్' ఇతడి ముఖ్య రచనలు. భారతదేశంలో బ్రిటిష్ సైన్యంలో అధికారిగా ఉద్యోగం చేసాడు.

* * *

వావిళ్ళ వేంకటేశ్వరశాస్త్రి (1885-1956): చేతివ్రాత పుస్తకాలు చదువుకునే రోజులలో మద్రాసులో ఆది సరస్వతీ నిలయ ముద్రాక్షర శాలను స్థాపించి చదువరుల కష్టాలను నివర్తిచేసిన శ్రీ వావిళ్ళ రామస్వామి శాస్త్రులవారి పుత్రుడు. తండ్రి నెలకొల్పిన ముద్రణాలయాన్ని వావిళ్ళ సంస్థగా అభివృద్ధిపరచి జీవిత కాలమంతా దీక్షా దక్షతలతో సంస్కృతాంధ్ర సారస్వతములకు ఏ ప్రభుత్వాలు, విశ్వవిద్యాలయాలు, అకాడమీలు చేయలేనంత సాటిలేని సాహితీ సేవచేసిన కృషీవలుడు. 1929 లో మద్రాసులో స్థాపింపబడిన ఆంధ్రా చేంబర్ ఆఫ్ కామర్స్‌కి తొలి గౌరవ కార్యదర్శి. తెలుగులో "త్రిలిఙ్గ" ఆంగ్లంలో "ఫెడరేటెడ్ ఇండియా" పత్రికలను స్థాపించి సంపాదకత్వాన్ని వహించారు. ఆంధ్ర విశ్వకళా పరిషత్తువారి కళా ప్రపూర్ణ సత్కారాన్ని పొందిన భాషోద్ధారకుడు "శాస్త్ర ప్రచార భూషణుడు."

## జీవితవలయంలో సుఖ సంతోషాలు కేంద్రీకృతం చేసుకో



"సోదరులారా; జీవితంలో అనేక సంవత్సరాల అనుభవంతో చెబుతున్నాను. ఈ దిక్కుమాలిన దుఃఖమయమైన ప్రపంచంలో ఉత్సాహపూరితంగా ఉండటం తప్పు కాదు. సుఖసంతోషాలను కేంద్రీకరించుకోగలిగితే మీ ఉద్యమాలు ఎంత అసాధ్యమైనవైనా అతి సౌలభ్యంగా నెరవేర్చుకోగలుగుతారు. జీవితంలో కలిగే కష్టపరంపరలకు క్రుంగిపోకుండా నిభాయించుకోగల ధైర్యసాహసాలను అలవరచుకోండి. ఉదాత్తులుగా ఉండడానికి ప్రయత్నించండి. అత్యంత ప్రేమానురాగంతో కలుపుగోలు తనాన్ని ప్రవృద్ధిపరచుకుంటూ అందరి అభిమానాన్ని పొందడానికి ప్రయత్నించాలి. మీ చుట్టూ సంతోష వాతావరణాన్ని కలిగించుకుంటే ఎటువంటి కష్టసమయాలలోనైనా ఉత్సాహాన్ని కోల్పోలేరు."

—వి. ఎస్. శ్రీనివాసశాస్త్రి

"మనో సౌందర్యాన్ని మించిన సౌందర్యం లేదు."

సోవియెట్ యూనియన్‌కి భారతదేశపు దౌత్యాన్ని వహించింది. 1949_52 వ సం.లో అమెరికాకి దౌత్యం వహించి, 1954_61 సం.లలో బ్రిటనుకి హైకమిషనర్ పదవిని అధిష్ఠించిన సాధ్వీమణి.

*  *  *

జాన్‌మాస్టర్స్ ప్రఖ్యాత ఆంగ్లేయ రచయిత. 'భవాని జంక్షన్, నైట్‌రన్నర్స్ ఆఫ్ బెంగాల్' ఇతడి ముఖ్య రచనలు. భారతదేశంలో బ్రిటిష్ సైన్యంలో అధికారిగా ఉద్యోగం చేసాడు.

*  *  *

వావిళ్ళ వేంకటేశ్వరశాస్త్రి (1885-1956): చేతివ్రాత పుస్తకాలు చదువుకునే రోజులలో మద్రాసులో ఆది సరస్వతీ నిలయ ముద్రాక్షర శాలను స్థాపించి చదువరుల కష్టాలను నివర్తిచేసిన శ్రీ వావిళ్ళ రామస్వామి శాస్త్రులవారి పుత్రుడు. తండ్రి నెలకొల్పిన ముద్రణాలయాన్ని వావిళ్ళ సంస్థగా అభివృద్ధిపరచి జీవిత కాలమంతా దీక్షా దక్షతలతో సంస్కృతాంధ్ర సారస్వతములకు ఏ ప్రభుత్వాలు, విశ్వవిద్యాలయాలు, అకాడమీలు చేయలేనంత సాటిలేని సాహితీ సేవచేసిన కృషీవలుడు. 1929 లో మద్రాసులో స్థాపింపబడిన ఆంధ్రా చేంబర్ ఆఫ్ కామర్స్‌కి తొలి గౌరవ కార్యదర్శి. తెలుగులో "త్రిలిజ్ఞ" ఆంగ్లంలో "పెడరేటెడ్ ఇండియా" పత్రికలను స్థాపించి సంపాదకత్వాన్ని వహించారు. ఆంధ్ర విశ్వకళా పరిషత్తువారి కళా ప్రపూర్ణ సత్కారాన్ని పొందిన భాషోద్ధారకుడు "శాస్త్ర ప్రచార భూషణుడు."

## జీవితవలయంలో సుఖ సంతోషాలు కేంద్రీకృతం చేసుకో



"సోదరులారా; జీవితంలో అనేక సంవత్సరాల అనుభవంతో చెబుతున్నాను. ఈ దిక్కుమాలిన దుఃఖమయమైన ప్రపంచంలో ఉత్సాహపూరితంగా ఉండటం తప్పు కాదు. సుఖసంతోషాలను కేంద్రీకరించుకో గలిగితే మీ ఉద్యమాలు ఎంత అసాధ్యమైనవైనా అతి సౌలభ్యంగా నెరవేర్చుకోగలుగుతారు. జీవితంలో కలిగే కష్టపరంపరలకు క్రుంగిపోకుండా నిభాయించుకోగల ధైర్య సాహసాలను అలవరచుకోండి. ఉదాత్తులుగా ఉండడానికి ప్రయత్నించండి. అత్యంత ప్రేమానురాగంతో కలుపుగోలు తనాన్ని ప్రవృద్ధిపరచుకుంటూ అందరి అభిమానాన్ని పొందడానికి ప్రయత్నించాలి. మీ చుట్టూ సంతోష వాతావరణాన్ని కలిగించుకుంటే ఎటువంటి కష్టసమయాలలోనైనా ఉత్సాహాన్ని కోల్పోలేరు."

—వి. ఎస్. శ్రీనివాసశాస్త్రి

"మనో సౌందర్యాన్ని మించిన సౌందర్యం లేదు."

# పాములు ప్రదర్శించే అద్భుతాలు

సుమారు 300 మిలియను సంవత్సరాలకు పైబడి భూతలం మీద వివిధ రకాల సరీసృపాలు జీవిస్తున్నాయి. ఇవి గాలిని పీల్చుకునే శీతల రక్తప్రవాహంగల జంతువులు. ఈ జాతికి చెందినవే పలురకాల పాములు.

ప్రపంచం మొత్తంమీద ఉండే 1,670 వివిధ రకాల పాములలో సుమారు 180 రకాలు మాత్రమే భారతదేశంలో కని



పిస్తాయి. పశ్చిమబెంగాల్ సుందర్‌బన్స్‌లో నివసించే 73 మి.మీల పొడవైన గ్రుడ్డి పాము (Blind snake) ప్రపంచంలో మిక్కిలి చిన్నది. దీనికి సుమారు 140 రెట్లు పెద్దదిగా అజగరం (Reticulated python) అనే కొండ చిలువ 10 మీ. ల పొడవు ఉంటుంది. ఇదే పాము లన్నిటిలో ఎక్కువ పొడవైనది. తూర్పు ఆఫ్రికాలో విషజాతి పాము 'బ్లాక్ మాంబా' ప్రపంచంలో పాములకంటే అమిత వేగంతో ప్రాకుతుంది. మోటార్ సైకిలిస్టులను కూడా తరిమే కింగ్ కోబ్రా (త్రాచులు) లను గురించి అనేక కట్టుకథలు ఉన్నా మిక్కిలి వేగంగా ప్రాకే బ్లాక్‌మాంబా గంటకు 11 కి.మీల వేగంతోమాత్రమే ప్రాకుతుంది.

పాములన్నీ విషపాములనే మనం అనుకుంటాం. కానీ ప్రపంచంలో కనపడే 2,500 వివిధ రకాల పాములలో 330 రకాల పాములు మాత్రమే విషపాములు. భారతదేశంలో ఉండే 235 రకాలలో 52 రకాలు మాత్రమే విషపాములు. ఈ 52 విషపాములలో సాధారణంగా 4 మాత్రమే కనిపిస్తాయి. తక్కినవి మనిషి సంచారం ఉన్నచోట అసలు కనిపించవు. సాధ్యమైనంతవరకు మనం నివసించే ఇండ్లకు, నివాసాలకు దూరంగా ఉంటాయి. భారత దేశంలో మిక్కిలి పెద్దది, ఎక్కువ అపాయకరమైనది కింగ్‌కోబ్రా.

పాములలో ఉండే విష ప్రమాణం పాము రకాన్ని బట్టి మారుతూంటుంది. ఇండియన్ స్పెక్టకల్డ్ కోబ్రా కంటే కింగ్‌కోబ్రా 6 రెట్లు అధికంగా విషాన్ని ఉత్పాదిస్తుంది. వివిధ విషపాములు, వాటి విషాన్ని గురించి చాలా

## నాట్యంలో ప్రపంచ రికార్డు

మాడ్రిడ్ (స్పెయిన్)లో అంటోనియో కార్లోస్ కానాస్ అనే 26 సం. ల యువతి 154 గంటల 44 నిమిషాలు ఏకధాటీగా నాట్యం చేసి ప్రపంచ రికార్డు స్థాపించింది.

"మన శత్రువులు మన లోపాలను తెలియజేసి మనకు మహోపకారం చేసారు."

మందికి తెలియదు. ఆఫ్రికాదేశపు స్పిటింగ్ కోబ్రా, ఇండోనేషియన్ ప్రాంతాలలో ఉండేఇండియన్ కోబ్రావంటి రకాలు, కాటేసి శరీరంలోకి విషం ఎక్కించవు. ఇవి పిచకారీ చేసినట్టు విషాన్ని వెదజల్లుతాయి. ఈ విధంగా వెదజల్లిన విషం మన కళ్ళలో చేరి కళ్ళకు మిక్కిలి హాని కలిగిస్తుంది. తోకలో చిన్న చిన్న ఎముకల వలయాలు ఉండి శబ్దం చేసే రాటిల్ పాము కరిచినప్పుడు విషం మానవ శరీరంలో సెకండుకి మూడు మీటర్లచొప్పున అతి శీఘ్రంగా ఎక్కుతుంది.

పాములు ఎప్పుడూ ముందు హెచ్చరిక లేకుండా మీద పడవు. త్రాచు పాముకు ఏదైనా అపకారం చేస్తే పైకి పడగఎత్తి కాటేస్తుంది. కరిచే ముందు రాటిల్ పాము తోకలో ఉండే ఎముకలను గల గలమని



శబ్దం చేస్తుంది. గల గల శబ్దాల సంఖ్యను బట్టి ఆ పాము ఎన్నిసార్లు కుబుసం విడిచిందో చెప్పుకోవచ్చు.

పాములకు చిన్న చిన్న కప్పలు, చిన్న చిన్న క్షీరదాలు మొదలైనవి ఆహారం. వీటికి నోరు బాగా సాగుతుంది. ఈ సౌకర్యంతో ఇవి అనేక అద్భుతాలు ప్రదర్శిస్తాయి. భారత దేశంలో గ్రుడ్లను తినే పాము ఒక్కటే ఉంది. సాధారణంగా ఇవి వాటిలావుకి



సుమారు రెండింతలు పరిమాణంగల గ్రుడ్లను కూడా సులభంగా మింగగలుగుతాయి. ఈ పాములు గ్రుడ్లను తప్ప వేరేవేటినీ తినవు. అన్నిటికంటే విచిత్రంగా ఉంటుంది ఇవి గ్రుడ్లమీది పైగుల్లను మలరూపంగా విసర్జిస్తాయి.

కొన్ని జాతి పాములు మరో జాతి పాము

## రూపాయి విలువ 16.08 పైసలు

రూపాయి విలువ భారతదేశం మొత్తం మీద 16.08 పైసలకి పడి పోయింది. 10 లక్షలకు పైబడిన జనాభా గల జైపూర్ (రాజస్థాన్)లో రూపాయి విలువ 14.33 పైసలకు దిగిపోగా, కేరళ తిరువనంత పురంలో రూపాయి విలువ 14.10 పైసలు మాత్రమే ఉంది.

('సెంట్రల్ స్టాటిస్టికల్ ఆర్గనైజేషన్ కన్‌స్యూమర్ ప్రైస్ ఇండెక్స్' సౌజన్యంతో)

"సౌజన్యం, సౌభ్రాతృత్వం, సమానత్వం, చిందరవందర చేసి మానవులకు శాంతి లేకుండా చేసేది మతం."

లను తింటాయి. ఈ అలవాటు అనేక రకాల పాములలో ఉంది. దీనినే 'ఒఫియోఫేగస్ బిహేవియర్' అంటారు.

ఒక జాతిపాము ఆ జాతిపామునే తినడం 'కానిబాలిజం' అంటారు. కొండచిలువ అనబడే పైథానులు చిన్న క్షీరదాలను తింటాయి. తినకపోయినా కొండచిలువ మనిషిని గట్టిగా చుట్టేసుకుని నొక్కి నలిపి ఊపిరి ఆడకుండాచేసి చంపేస్తుంది. సాధారణంగా పాములు వాటి పిల్లలకు సంరక్షణ



కలిగించవు. కానీ కింగ్ కోబ్రావంటి కొన్ని త్రాచుపాము రకాలు, కొండచిలువ (పైథానులు) లు గ్రుడ్లను జాగ్రత్తగా సంరక్షించుకుంటాయి. కింగ్‌కోబ్రా (త్రాచు) చిన్న గూడుకట్టి అందులో జాగ్రత్తగా గ్రుడ్లు పెడుతుంది. ఆ గ్రుడ్లు పొదిగి పిల్లలయేదాకా అక్కడి నుంచి అది కదలదు. కొండచిలువ గూడు కట్టదు. కాని గ్రుడ్లుపెట్టి తన శరీరాన్ని చుట్టలుగా చుట్టుకుని గ్రుడ్లను కప్పుతుంది. శరీరాన్ని అనువుగా త్రిప్పుకుంటూ ఆ గ్రుడ్లకు కావలసిన ఉష్ణాన్ని కూడా కలిగిస్తుంది. ఈ రెండు జాతి పాములు గ్రుడ్లలోనుంచి పిల్లలు వచ్చేదాక 2 మాసాల పాటు ఆహారం తినవు. ఆ గ్రుడ్లదగ్గరే కావలా కాస్తాయి.

పాములను గురించి అనేక కట్టుకథలు ప్రచారంలో ఉన్నాయి. బ్రాంజ్‌బేక్ ట్రీస్నేక్ అనే పాము ఒక మనిషిని కరచి ఆ మనిషి మరణించిన తరువాత దగ్గరలో ఉన్నచెట్టును ఎక్కి మరణించిన వ్యక్తి అంత్యక్రియలను చూస్తూంటుంది అంటారు. వాస్తవానికి బ్రాంజ్‌బేక్ ట్రీస్నేక్ విషపాము కాదు. ఇది కాచేస్తే కోరలు గ్రుచ్చిన ఆనవాలే తప్ప వేరే అపాయం ఉండదు. ఎగిరే (Flying - snake) పాము ఎగురుతుంది అనుకుంటారు. ఇవి ఎగరవు. ఒక చెట్టునుంచి ఇంకో చెట్టుకు, ఒక కొమ్మనుంచి ఇంకో కొమ్మకు ఇవి మెడసాచుకుని జారతాయి. రాట్‌స్నేక్ త్రాచుపాముతో జత కూడుతుంది అంటారు. ఇది నిజంకాదు. పైకి చూడడానికి రెండూ ఒకే రకంగా కనిపిస్తాయి. ఈ రెండు రెండు ప్రత్యేక జాతులకు చెందిన పాములు.

('మద్రాసు స్నేక్‌పార్క్' సౌజన్యంతో)

## ప్రపంచంలో తొలిసారిగా ఊపిరితిత్తుల జంట మార్పిడి

1986 వ సం. రం సెప్టెంబరు - అక్టోబర్ మాసాలలో లండన్ (ఇంగ్లండ్) నగరంలో హేర్‌ఫీల్డ్ హాస్పిటల్‌లో డా. మాగ్‌డి యకూబ్ ముగ్గురికి శస్త్రచికిత్స చేసి ప్రపంచంలో మొట్టమొదటిసారిగా ఊపిరితిత్తుల జంటను మార్చాడు.

"నిన్ను నీవు తెలుసుకో, నీకు ఇతరులకు
గల సంబంధం తెలుసుకో."

# బహుమతి పొందిన వ్యాసం

## నాజూకు - నాణ్యత విజయానికి పునాది

కె. శ్యామ్‌ప్రసాదరావు,
శేషాద్రిగుట్ట.

మేడ్ ఇన్ జపాన్, మేడ్ ఇన్ చైనా, మేడ్ ఇన్ అమెరికా అని వస్తువులపై కన బడితే చాలు వాటిని ఆలోచించకుండా కొనే స్తారు. చాలామంది అవే మేడ్ ఇన్ ఇండియా అని ఉంటే తూచి తూచి తీసుకుని గ్యారంటీ ఇస్తారా అని అడుగుతారు, అంటే ఆ యా దేశాల వస్తువుల నాణ్యతపై గల నమ్మ కమే.

మన దేశం కూడా నాజూకు - నాణ్యతకు ఎంతో ప్రసిద్ధి. ప్రాచీన కాలంలో మన చేనేత కార్మికులు చీరలను నేసి అగ్గిపెట్టెలో పెట్టి ఎగుమతి చేసేవారట! అంటే ఎంత నాజూకుగా బట్టలు నేసేవారో తెలుస్తుంది. ఈ నాడు పరిశ్రమలలో ఆధునిక యంత్రాలు, కంప్యూటర్ల సహాయంతో వస్తువులను అతి ఖచ్చితంగా ఉత్పత్తి చేస్తే నాణ్యత ఉంటుంది. సమయం, లాభం రెండూ కలిసి వస్తాయి. అట్టి వస్తువులకు అంతర్జాతీయ మార్కెట్‌లో మంచి గిరాకీ ఉంటుంది. ఇటు వంటి నాణ్యతను గుర్తించడానికి మన ప్రభుత్వం ప్రతి సంవత్సరం ఒక నెల 'నాణ్యత పరిరక్షణ మాసం'గా పాటిస్తుంది.

మన పరిశ్రమల యాజమాన్యం వస్తువు వులను ఉత్పత్తి చేసేముందు 'నాజూకు నాణ్యత' విజయానికి పునాది అనే వాక్యాన్ని గు ర్తించుకోడం అవసరం.

### 10,000 కంటే అధికంగా పరుగులు గెలుచుకున్న మొదటి బాట్స్‌మెన్



1985-86 వ సం. లో ఆస్ట్రేలియాలో జరిగిన అడిలెయిడ్ టెస్ట్‌లో 160 పరుగులు చేసినప్పుడు సునీల్ గవాస్కర్ ప్రపం చంలో 9,000 కంటె అధికంగా పరుగులు గెలుచుకున్న మొదటి బాట్స్‌మన్ అయ్యాడు.

ఇటీవల అహమ్మదాబాదు టెస్టులో ఇతడు 10,000 పరుగులు పూర్తిచేసి అభినందన లను అందుకున్నాడు.

"సదవకాశాలను వృద్ధి చేసుకోడమూ, మనకి అందుబాటులో ఉన్న మంచిని గ్రహించడమూ—ఈ రెండే ఉన్నత జీవన పథానికి రాచబాటలు." —జాన్సన్

పెరుగుతున్న వస్తూత్పత్తికి తగినట్టుగా అమ్మకాలు జరగాలంటే నాజూకుగా నాణ్యంగా వస్తూత్పత్తిని మలచాలి. ఈ రెంటిపైన ఆధారపడి వినియోగదార్లు అధిక సంఖ్యలో వస్తువులను కొంటారు. వినియోగదార్లను నాసిరకం వస్తువుల నుండి నకిలీ వస్తువుల నుండి రక్షించడానికి వినియోగదార్ల సంఘాలు అనేకం దేశంలో స్థాపించబడ్డాయి. వాటి లక్ష్యాలు వస్తూత్పత్తిని పరోక్షంగా నాణ్యతగా ఉండేటట్లు ప్రోత్సహించడం, అక్రమ ధరల బారి నుండి వినియోగదార్లను రక్షించడం, మేలురకం వస్తువులు అమ్మకం జరిగేటట్లు చూడటం. ప్రభుత్వం కూడా చట్టాల ద్వారా వినియోగదార్లకు రక్షణ కలిగిస్తుంది.

నాణ్యత లేని సరకుకు గిరాకీ ఎప్పుడూ ఉండదు. అందుకు అమ్మకందార్లు ఈ వస్తువులపై ఉచిత బహుమతులు, ప్రకటిస్తుంటారు. కొన్ని నాసిరకం సబ్బులపై పిన్నులు, దువ్వెనలు, అగ్గిపెట్టెలు ఇస్తుంటారు. ఈ విధంగా వినియోగదార్లను ఎప్పుడూ మోసం చేయలేరు. నిజానికి నాణ్యత గల సరకుల విక్రయానికి ఇటువంటి హంగామా అవసరం లేకుండానే వినియోగదార్లు ఈ వస్తువుల కొనుగోలుకు అలవాటుపడిపోతారు.

కొంతమంది వ్యాపారవేత్తలు వస్తువులు నాసిరకం అయినప్పటికీ వాటిని అందమైన అట్టపెట్టెలలో అమర్చి అమ్ముతుంటారు. పై మెరుగులు చూసి అమాయకులైన వినియోగదార్లు మోసపోతుంటారు, వాడకంలో వీటి నిజాయితీ తెలిసిపోతుంది. వినియోగదార్లకు పూర్తి సంతృప్తి నిచ్చే వస్తువులను ఉత్పత్తి చేస్తే పరిశ్రమలు ఆర్థికంగా నిలదొక్కుకుని లాభాలను పొందగలుగుతాయి. దాని ఫలితంగా దేశం ఆర్థికంగా పురోగమించగలదు.

( 2 వ పేజీ తరువాయి)

మనస్సే నిన్ను ముప్పతిప్పలు పెడుతూంది. సత్యం అసత్యంగా కనిపిస్తుంది. అసత్యం సత్యంగా కనిపిస్తుంది. అంతరంగ పారిశుద్ధత సంతరించుకోడానికి బదులు పగ కసి పెంచుకుని మనస్సులో కుమిలి కుమిలిపోతావు.

ప్రకోపాలు ఉధృతంగా చెలరేగిన మనోమందిరంలో మనోభావాలు, స్వభావ శక్తులు పరస్పర నిరంతర పోరాటంతో జీవితం అల్లకల్లోలం అయిపోతుంది. క్రియ ఉంటే ప్రతిక్రియ ఉంటుంది. ఒక పని జరిగితే దానికి తగిన ఫలితాలు సంభవించి తీరతాయి. హేతువు ఉంటే దానివల్ల కలిగే ప్రయోజనం ఉండక మానుతుందా? చేసుకున్న వాడికి చేసుకున్నంత. నీకు కష్టాలు సంభవించాయంటే, నీకు బాధలు ఏర్పడ్డాయంటే ఎవరు కారణం? నీ అజ్ఞానమా? పరాయివాళ్ళా? పాపం చేసిన వారొకరైతే పాపఫలాలను అనుభవించేవారు మరొకరుంటారనుకున్నావా? సృష్టి సదా న్యాయసమ్మతంగా ప్రవర్తిస్తుంది. న్యాయం లోపిస్తే ప్రళయం విజృంభిస్తుంది. ప్రకృతి ధర్మం మొగ్గు తగ్గు లేకుండా త్రాసులో సరిసమానంగా తూగుతుంది.

“సంతోషాన్ని దాచుకోగల వ్యక్తి బాధలను
దాచుకోగల వాడికన్నా గొప్పవాడు.”

# పట్టుపురుగు

కె. ఉష

పట్టుపురుగు గుడ్లనుంచి వెలువడు 'లార్వాలు' పెరిగినప్పుడు పట్టు నూలును విసర్జిస్తూ పట్టుకాయ (గూడు)ను అల్లుకుంటుంది. ద్రవరూపంలో విసర్జింపబడే ఈ పదార్థం వెంటనే నూలుపోగుగా ఏర్పడుతుంది. హిరాట్సుకా అనే శాస్త్రజ్ఞుడు పరిశోధించి లార్వా పురుగులు కలిగించే ఒత్తిడి వల్ల ప్రోటీను మాలిక్యూలలో ఏర్పడే రాపిడి వల్ల ఈ ప్రక్రియ జరుగుతూందని నిరూపించాడు.



పట్టుకాయలు

పట్టులో ముఖ్యంగా ఫైబ్రాయిన్, ఫైబ్రాయిన్‌పైన పూతగా ఏర్పడే "సెరీసీన్" అనే రెండు రకాల ప్రోటీనులు ఉంటాయి. పట్టు లార్వాలు ప్రవృద్ధిపొంది పెరిగిన తరువాత వాటి నోటిలో ఉండే పట్టుగ్రంధులు (Silk Glands) వివిధ భాగాలలో ఇవి సంయోగం చెందుతాయి.

ప్రపంచంలో వ్యాపార రీత్యా ముఖ్యమైన మల్బరీ, టస్సార్, ఎరీ, ముగా అనే నాలుగు పట్టు రకాలు ఒక్క భారతదేశంలోనే ఉత్పత్తి కాబడుతున్నాయి. ప్రపంచంలో మల్బరీ పట్టు విస్తారంగా ఉత్పత్తి చేసే దేశాలలో భారతదేశం మూడవ స్థానాన్ని ఆక్రమిస్తూంది. మొత్తం ప్రపంచం ఉత్పత్తిలో 11 శాతం భారత దేశానిది. టస్సార్‌రకం పట్టు ఉత్పాదనలో చైనా తరువాత భారతదేశం ద్వితీయస్థానాన్ని పొందుతూంది. ప్రసిద్ధి పొందిన బంగారు పసుపురంగు మూగా పట్టు అస్సాంలో విస్తారంగా ఉత్పత్తి చేయబడుతూంది.

పట్టు పరిశ్రమ కుటీర పరిశ్రమలలో ముఖ్యమైనది. దీనిని మించినది మరొకటి లేదు. గ్రామీణ ప్రదేశాలలో ఈ పరిశ్రమ దాదాపు 44 లక్షల మందికి పూర్తి మరియు తాత్కాలిక ఉద్యోగావకాశాలు కలిగిస్తూంది. రాశిల్కు, డౌపియన్ శిల్కు, చేతితో వడికిన శిల్కు, వైల్డ్ శిల్కులతో తయారైన పట్టుబట్టలు అందంలో, సౌకుమార్యంలో, నాణ్యంలో, ఇతర రకం బట్టలతో సరిసమా

## శ్వాగడానికి 'ప్రోటీన్ ఆక్సిజన్'

రష్యన్ వైద్యులు దీర్ఘకాలం పరిశోధనలు చేసి త్రాగడానికి వీలయే ప్రాణవాయువును తయారుచేశారు. పాలు, పన్నీరు, (రోజ్ వాటర్) కోడిగ్రుడ్డు తెల్లసొన కలిపి ఆ మిశ్రమంలోకి ఆక్సిజన్ పంపి 'ప్రోటీన్ ఆక్సిజన్' రూపొందించారు.

"వీణాతంతులను చేతితో మీటినప్పుడే వీణయందు నాదమేర్పడును."

# పట్టుపురుగు

కె. ఉష

పట్టుపురుగు గ్రుడ్లనుంచి వెలువడు 'లార్వాలు' పెరిగినప్పుడు పట్టు నూలును విసర్జిస్తూ పట్టుకాయ (గూడు)ను అల్లుకుంటుంది. ద్రవరూపంలో విసర్జింపబడే ఈ పదార్థం వెంటనే నూలుపోగుగా ఏర్పడుతుంది. హిరాట్సుకా అనే శాస్త్రజ్ఞుడు పరిశోధించి లార్వా పురుగులు కలిగించే ఒత్తిడి వల్ల ప్రోటీను మాలిక్యూలలో ఏర్పడే రాపిడి వల్ల ఈ ప్రక్రియ జరుగుతూందని నిరూపించాడు.



పట్టుకాయలు

పట్టులో ముఖ్యంగా ఫైబ్రాయిన్, ఫైబ్రాయిన్‌పైన పూతగా ఏర్పడే "సెరీసీన్" అనే రెండు రకాల ప్రొటీనులు ఉంటాయి. పట్టు లార్వాలు ప్రవృద్ధిపొంది పెరిగిన తరువాత వాటి నోటిలో ఉండే పట్టుగ్రంధులు (Silk Glands) వివిధ భాగాలలో ఇవి సంయోగం చెందుతాయి.

ప్రపంచంలో వ్యాపార రీత్యా ముఖ్యమైన మల్బరీ, టస్సార్, ఎరీ, ముగా అనే నాలుగు పట్టు రకాలు ఒక్క భారతదేశంలోనే ఉత్పత్తి కాబడుతున్నాయి. ప్రపంచంలో మల్బరీ పట్టు విస్తారంగా ఉత్పత్తి చేసే దేశాలలో భారతదేశం మూడవ స్థానాన్ని ఆక్రమిస్తూంది. మొత్తం ప్రపంచం ఉత్పత్తిలో 11 శాతం భారత దేశానిది. టస్సార్ రకం పట్టు ఉత్పాదనలో చైనా తరువాత భారతదేశం ద్వితీయస్థానాన్ని పొందుతూంది. ప్రసిద్ధి పొందిన బంగారు పసుపురంగు మూగా పట్టు అస్సాంలో విస్తారంగా ఉత్పత్తి చేయబడుతూంది.

పట్టు పరిశ్రమ కుటీర పరిశ్రమలలో ముఖ్యమైనది. దీనిని మించినది మరొకటి లేదు. గ్రామీణ ప్రదేశాలలో ఈ పరిశ్రమ దాదాపు 44 లక్షల మందికి పూర్తి మరియు తాత్కాలిక ఉద్యోగావకాశాలు కలిగిస్తూంది. రాశిల్కు, డొపియన్ శిల్కు, చేతితో వడికిన శిల్కు, వైల్డ్ శిల్కులతో తయారైన పట్టుబట్టలు అందంలో, సౌకుమార్యంలో, నాణ్యంలో, ఇతర రకం బట్టలతో సరిసమా

## త్రాగడానికి 'ప్రోటీన్ ఆక్సిజన్'

రష్యన్ వైద్యులు దీర్ఘకాలం పరిశోధనలు చేసి త్రాగడానికి వీలయే ప్రాణవాయువును తయారుచేశారు. పాలు, పన్నీరు, (రోజ్ వాటర్) కోడిగ్రుడ్డు తెల్లసొన కలిపి ఆ మిశ్రమంలోకి. ఆక్సిజన్ పంపి 'ప్రొటీన్ ఆక్సిజన్' రూపొందించారు.

"వీణాతంతులను చేతితో మీటినప్పుడే వీణయందు నాదమేర్పడును."

ంగా ఉంటాయి. వీటికి రంగు బాగా పడుతుంది. ఇవి బాగా మన్నుతాయి.

చీరలకు, కోట్లకు, పరుపుల లైనింగుకు, కుషనులకు, గొడుగులకు, నెక్టైలకు, చేతి రుమాళ్ళకు, గృహాలంకరణలకు, ఇతర అనేక పారిశ్రామిక వస్తువులకు మంచిరకం పట్టును విస్తారంగా వాడతారు. కుట్టడానికి ఉపయోగించే పట్టుదారం, పట్టు అల్లికలు కూడా లభిస్తాయి. పిండి మరలలో, ఫార్మసీలలో, డైయింగ్ రంగువేసే ఫ్యాక్టరీలలో స్క్రీనుల అద్దకానికి బోల్టింగ్ శిల్కును



LARVE (SILK)

ఉపయోగిస్తారు. వ్రాత కళకు కాలిగ్రాఫరులు, చిత్రకళకు పెయింటరు శిల్కు కాన్వాసులను వాడతారు. ఎలక్ట్రానిక్ టైపు రైటర్లలో శిల్కు రిబ్బనును ఉపయోగిస్తారు. శిల్కు రిబ్బను సిరాను శీఘ్రంగా పీల్చుకుంటుంది. అచ్చు స్వచ్ఛంగా పడుతుంది.

పట్టు పరిశ్రమలో ముఖ్యంగా పట్టుదారం తీసేటప్పుడు వచ్చే ఇతర వ్యర్థ పదార్థాలు, పురుగులు చచ్చిన (dead worm) కకూనులు, చెడిపోయిన కకూనులు, సరిగా రూపొందని (malformed) కకూనులు; గుచ్చుకుపోయిన (pearced) కకూనులు కోసుకుపోయిన (cut) కకూనులు, నాశిరకం రిజెక్టడ్ కకూనులు మొదలైన వాటిని ఉపయోగించి రాశిల్కు, డేపాయిన్ శిల్కు, ప్లాస్ శిల్కు, స్పన్ శిల్కు బట్టలు తయారు చేస్తారు. ప్యూపాలను భూసారాభివృద్ధికి ఎరువులుగా వాడతారు.

పట్టు పురుగులు వివిధ రసాయనిక వస్తువులలో కలసిన విషపదార్థాలను తెలుసుకొనుటకు 'చేసే పరీక్షలకు బయోస్సే (Biossay) పదార్థంగా ఉపయోగపడుతున్నాయి.

పట్టు పురుగులు క్యాన్సర్ రోగాన్ని కుదురుస్తాయి. లా లిచి సెయాకూ (La-lichi seiyaku) అనే జపాన్ సంస్థ పట్టుపురుగులలో నుంచి ఆల్ఫా ఇంటర్ ఫెరాన్ అనే క్యాన్సర్ నిరోధక ఔషధాన్ని ఉత్పత్తి చేయవచ్చు అని అంటూంది.

ప్రాణ త్యాగం చేసి మానవులకు విలాసం ఆనందం కలిగించే పట్టుపురుగు సజీవ దీపకళిక అంటే ఆశ్చర్యంలేదు.

## 240 సం. కు పూర్వం తెలుగు పుస్తకం మొదటిసారిగా ముద్రణ మయింది

విదేశీయుల ద్వారా మన దేశానికి వచ్చిన ముద్రణకళ అనేక మార్పులను చేర్పులను చేసుకుని నేటి స్వరూపం సిద్ధించుకుంది. మొట్టమొదట 1746 వ సం. లో తొలిసారిగా తెలుగు పుస్తకం ముద్రణ మయింది. జర్మనీలో హాలీ నగరంలో రెవరెండ్ బెంజమిన్ షూర్జ్ అనే పాదిరీ దీన్ని ముద్రించాడు. ఇది క్రైస్తవమత ప్రచార గ్రంథం.

"తప్పులు చేయని మానవుడు
సాధారణంగా ఏ పనీ సాధించలేడు."

—ఎడ్వర్డ్ జాన్ ఫిలిప్స్

# పోటీలు

ఏప్రిల్ 1987

'విస్డమ్' పోటీలలో ఎవరైనా పాల్గొనవచ్చు. ఏ ఎంట్రీకాఎంట్రీ విడిగా పావుఠావు సైజుకు తగ్గని కాగితంమీద వ్రాయాలి. ప్రతి ఎంట్రీమీద అడ్రసు ఉండాలి. ఒకే కాగితంమీద ఒకటి కంటె ఎక్కువ ఎంట్రీలు వ్రాస్తే పరిశీలించబడవు. సరియైన లేదా మేలైన ఎంట్రీలు చాలా ఉంటే లాటరీ పద్ధతిలో ఎన్నికైన ముగ్గురు విజేతలకు రూ. 15లు, రూ.10లు, రూ. 5 లు ఖరీదుచేసే పుస్తకాలు బహుమతులుగా పంపబడును. విజేతల ఎన్నికలో సంపాదకునిదే తుది నిర్ణయం. ఎంట్రీలకు 'పోటీకూపన్' (ఒక ఎంట్రీకి చాలు) అంటించి పంపాలి. ఒక కూపన్‌తో ఒకేసారి ఎన్ని ఎంట్రీలయినా పంపవచ్చును. ఎంట్రీలు అందవలసిన ఆఖరుతేదీ ఏప్రిల్ 20. 1987. పంపవలసిన చిరునామా: పోటీల నిర్వాహకుడు, తెలుగు 'విస్డమ్', 9, దేశికా రోడ్డు, మైలాపూరు, మద్రాసు-600 004.

— సంపాదకుడు

## వ్యాసం

'వ్యక్తిత్వాభివృద్ధికి సౌందర్యం దోహదకారి' అనే అంశంమీద 300 మాటలు వ్రాసిపంపండి.

## క్విజ్

1. ఈ క్రిందివారిలో ఎవరు జనవరి 1986 వ సం. లో ఫీల్డ్‌మార్షల్ పదవిని అధిష్ఠించారు?

(ఎ) జనరల్ జి.జి. బెవూర్, (బి) జనరల్ ఎ.ఎస్. వైద్య, (సి) జనరల్ కె ఎమ్.కరియప్ప, (డి) జనరల్ ఒ. పి మల్‌హోత్రా.

2. ఏ దేశాన్ని "లాండ్ ఆఫ్ వైట్ ఎలిఫెంట్స్" (Land of white Elephants) అంటారు?

3. కలకత్తాలో నెలకొన్న 'నిర్మల్ హృదయ్' వీరితో సంబంధపడి వుంది.

(ఎ) రవీంద్రనాథ్ ఠాగూర్.(బి) మదర్ తెరీసా, (సి) బంకించంద్రచటర్జీ, (డి) మహాత్మాగాంధీ.

4. రాష్ట్రపతిచేత రాజ్యసభకు ఎంతమంది సభ్యులు ప్రతిపాదింపబడతారు?

(ఎ) 2, (బి) 10 (సి) 12, (డి) ఎంతమందైనా.

5. 1986 వ సం. ప్రారంభంలో ఈ క్రింది ఏ అమెరికన్ స్పేస్‌షటిల్ అంతరిక్షంలో పేలిపోయింది?

(ఎ) డిస్కవరీ, (బి) కొలంబియా, (సి) ఛాలెంజర్, (డి) అట్లాంటిస్.

## పశ్చిమ బెర్లిన్ 'జూ'లో అనేక రకాల జంతువులు

జర్మనీలో పశ్చిమ బెర్లిన్ 'జూ' లో ప్రదర్శింపబడే జంతువులలో — 2,300 వివిధ రకాలు ఉన్నాయి. ప్రపంచంలో అధిక రకాల జంతువులు ఇక్కడే ఉన్నాయి.

"సుభిక్షము ఉన్నప్పుడు అన్నదానం చేయడంకన్నా ...క్షకాలంలో అన్నద... అధికం

6. ఢిల్లీ భారతదేశపు రాజధానిగా ఏర్పడిన ంవత్సరం——.

(ఎ) 1905, (బి) 1906, (సి) 1911, ి) 1912.

7. వంటకు ఉపయోగించే బేకింగ్ పవు ర్ (Baking Powder) ని రసాయనిక ాస్త్రంలో ఇలా అంటారు.

(ఎ) సోడియం సల్ఫేట్ (బి) సోడియం ి కార్బొనేట్, (సి) సోడియం క్లోరైడ్ డి) సోడియం సిట్రేట్.

8. రహిమ్ తుల్లా కప్ ఈ క్రింది క్రీడ ులో దేనికి సంబంధించినది:

(ఎ) హాకీ (బి) ఫుట్ బాల్ (సి) టేబిల్ టెన్నిస్ (డి) బాట్ మింటన్.

## పజిల్



ఆధారాలు - అడ్డం: 1. సోదరి ివేదిత అని పిలువబడే మిస్ మార్గరెట్ నోబుల్ ఇతని శిష్యురాలు, 4. సముద్రంలో ఒడలు, ఇతర నౌకలు భద్రముగా నుండు ికు ఏర్పరచిన ఆశ్రయము, 6. తప్పుచేసి నప్పుడు మన్నించమని వేడుకొనడం-విశాల హృదయంగల విశిష్టుల లక్షణం, 7. ఎక్కు వదిలేక ఆరోహించునది అని అర్థమిచ్చే మాటలో ప్రథమాక్షరం చివరపడింది, ి. ప్రపౌత్రుడు మురుడనే రాక్షసిని చంపిన ాడు, 10. పెండ్లికుమార్తెకు సాధారణంగా కలిదండ్రులు స్త్రీ ధనం ఇవ్వడం 'వాడుక' 11. సమయాన్ని సూచిస్తుంది, 14. ముం జేతికి ధరించే ఒక ఆభరణ విశేషము, 15. సర్వకాల సర్వావస్థలయందు అను హ్యూతముగా ఉండే తత్త్వము.

నిలువు: 1. చెప్పాలని మనస్సులో కలిగే ఉబలాటం, 2. నడుముకు బిగించు కునే బెల్టువంటి వస్తువు అని అర్థమిచ్చే మాటలో మొదటి చివరి అక్షరాలు తారు మారైయాయి, 3. 'ఇంద్రియ నిగ్రహం', 'శాంతి', 'ఉపశమించగా', అనే మూడు మాటలలో మూడవ మాట తారుమారు అయింది: 4. పరమశివుడు కంఠంలో

## 60 సం.లు పైబడిన వయోవృద్ధులు 415.6 మిలియను మంది

యునైటెడ్ నేషన్స్‌వారి లెక్కల ప్రకారం ప్రస్తుతం ప్రపంచంలో 415.6 మిలియను మంది 60 సంవత్సరాలు దాటిన వయోవృద్ధులు ఉన్నారు. గత 5 సంవత్స రాలలో వీరి సంఖ్య 44.7 మిలియను పెరిగింది. 1985వ సం. లో 80 సం. ల పైబడిన వయోవృద్ధులు 39.7 మిలియను మంది. వీరి సంఖ్య గత 5 సం. లలో సుమారు 16 శాతం పెరిగింది.

"సరిపెట్టుకొనుట నేర్చుకొనినయెడల మనంతట మనం అనేక మంచిగుణములను అలవరచుకొనవచ్చును."

ధరించిన విష విశేషము, 5. ఈ క్రొత్త సంవత్సరాదినుంచి 56 సంవత్సరాల తరువాత వచ్చే సంవత్సరం, 8. అంకురించిన యౌవ్వనంగల ముద్దరాలితనం, 9. మన్మథుడు అని అర్థమిచ్చేమాట చివర 'గు' చేరింది, 12. దారిద్ర్యం దీన్ని కలిగిస్తుంది, 13. ఒకప్పుడు సహజమైనవి విరాళంగా లభించినా, ఇప్పుడు కృత్రిమమైనది విస్తారంగా దిగుమతి అవుతూంది.

## తెలివికి పరీక్ష

1. భారత స్వాతంత్ర్యంకోసం ఆంధ్రులు చేసిన నినాదం ఇందులో ఇమిడి ఉంది చెప్పండి మరి—

'త తెర మా కొల్ల దొనంద్దీ'

2. టివికి ఇడియట్ బాక్స్ అనే పేరు ఎందుకు వచ్చింది?

3. ఒక కిలోమీటరు సుమారు (ఎ) 1/10 వంతు మైలు, (బి) 5/8 వంతు మైలు, (సి) 2 మైళ్ళు (డి) 8/5 వంతు మైలు.

4. ఈ క్రింది వరుసలో చేరనివారెవరు?

(ఎ) అబ్రహాం లింకన్, (బి) వి.వి. గిరి, (సి) కెన్నడీ, (డి) లాల్‌బహదూర్ శాస్త్రి.

5. 'నోరు' అనే మాట ఈ క్రింది అర్థాలను తెలియజేయడానికి వ్యవహారంలో ఎలా వాడతారు? (ఎ) తినాలని ఆశ కలుగు, (బి) ఎక్కువగా మాట్లాడలేనిది, (సి) పదిమంది చెప్పుకునేటట్టు నిందా పాత్రమగు, (డి) మాట్లాడకుండా చేయడం.

6. టానిక్ శరీరానికైతే పెంట దేనికి? (ఎ) ఎరువు, (బి) రైతు (సి) కీటకాలు, (డి) చెట్లు.

## విసడమ్
## పోటీల కూపను
## ఏప్రిల్ 1987

7. కమిల్ బ్రష్ దేంతో తయారైంది?

8. "ఎక్కడ స్త్రీలు పూజింపబడతారో
అక్కడ దేవతలు విహరిస్తారు,
ఎక్కడ స్త్రీలు పూజింపబడరో
అక్కడ వారి ప్రయత్నాలు వ్యర్థమవుతాయి."

అని ఎవరు మొట్టమొదట చెప్పారు?

## ఇద్దరు యజమానులను ఎవ్వరూ సేవించలేరు



ఏ మానవుడూ ఇద్దరు యజమానులను సేవించలేడు. ఎందుకంటే ఒకరిని భక్తితో ఆదరిస్తే ఇంకొకరిని ద్వేషించవలసి వస్తుంది. లేకపోతే ఒకరిని సదా సేవిస్తూ ఇంకొకరిని నిర్లక్ష్యంతో నిరాకరించాలి. కరుణామయుడైన ప్రభువుని, ధన దేవతని ఒకేసారి సేవించడం అసాధ్యం.

—జీసస్ క్రైస్తు

'అగర్భ శ్రీమంతుల బిడ్డలకు డబ్బుయొక్క మహత్వము తెలిసియుండదు.

# విస్డమ్
## పోటీల కూపను
## ఏప్రిల్ 1987

## మాటల మహిమ

ఈ క్రింది మాటలకు సరియైన అర్థాన్ని/అర్థాలను సూచించండి:

1. మట్టు: కుదురు (ఎ), అందము (బి), పరిమాణము (సి), మర్యాద (డి)
2. మెల్ల: వంకరైనది (ఎ), వేగము లేనిది, (బి), శాంతము (సి), అనుభవించు (డి).
3. వావి: శాస్త్రీయమైన సంబంధ యోగ్యత (ఎ), క్రమము (బి), వాడుక (సి), తారతమ్యము (డి).
4. వాసి: భేదము (ఎ), ఆధిక్యము (బి), లాభము (సి), గొప్పతనము (డి),
5. సవరించు: అడ్డగించు (ఎ), చక్కబరచు (బి), సమకూర్చు (సి), అనుభవించు (డి).
6. సేస: అక్షతలు (ఎ), పుష్పాంజలి (బి), ఆసక్తుడు (సి), యజమానుడు (డి).
7. కూరిమి: వాత్సల్యము (ఎ), వలపు (బి), నిద్ర (సి), కునుకు (డి)
8. కసరు. వెగటు (ఎ), కోపము (బి), చూపు (సి), కమ్మనిది (డి).

## ముఖచిత్రవ్యాఖ్య

ఆరు మాటలకు మించకుండా ఈ సంచిక ముఖచిత్రానికి తగిన శీర్షిక వ్రాసి పంపండి.

## పాఠకుల అభిప్రాయాలు

దైనందిన జీవితంలో మీకు ఎదురయ్యే ఏ సంఘటనను గురించి అయినా 15 మాటలకు మించకుండా చమత్కారమైన వ్యాఖ్య వ్రాసి పంపండి. ఉత్తమ వ్యాఖ్యకు రూ. 5లు ఖరీదుచేసే పుస్తకం బహుమతి.

## మీరైతే...?

'సంతోషం సగం బలం' అంటే మీరు ఏం చేస్తారు? క్లుప్తంగా చమత్కారంగా ఉండే జవాబు వ్రాయండి.

## భావపరిచయపోటీ







8 మాటలకు మించకుండా పైన కనిపిస్తున్న చిత్రాలను పరిశీలించి చమత్కారమైన లేదా ఆలోచన రేకెత్తించే శీర్షికను సూచించండి.

"మూర్ఖుల నుంచి ప్రశంసలు అందుకోడం కన్న బుద్ధిమంతులచేత తిట్లు తినడం మంచిది." —షేక్స్పియర్

# పోటీలు-ఫలితాలు

(ఫిబ్రవరి 1987)

**వ్యాసం - విజేతలు** మొదటి బహుమతి: ఆర్. యు. రమణ, విజయవాడ; రెండవ బహుమతి: పి. ఆదిలక్ష్మి, గుంటూరు; మూడవ బహుమతి: దరిశి వెంకటేశ్వరరావు, కోడూరు, (కడప జిల్లా).

**క్విజ్ - జవాబులు:** 1. (సి) రష్యా, 2. (ఎ) సియోల్, 3. (బి) పుట్టుక రేటు పెరుగుదల, 4. (ఎ) తమిళనాడు, 5. అకుపంక్చర్ వైద్యక్రియమైన చికిత్సా విధానం - దీనిలో బాధ నిర్మూలనకు సన్నని సూదులు శరీరంలో గ్రుచ్చబడతాయి, 6. (సి) విద్యుత్‌శక్తి ఉత్పాదన, 7. (డి) తిరువనంతపురం, 8. (బి) బిలియర్డ్స్.

**విజేతలు** మొదటి బహుమతి: ఎస్. సత్యనారాయణ, వీణవంక, (కరీంనగర్ జిల్లా); రెండవ బహుమతి: బి. ప్రజ్యోతి, కరీంనగర్; మూడవ బహుమతి: జి. రాజశేఖర్, బి. కొత్తకోట, (చిత్తూరు జిల్లా).

**పజిల్ - జవాబులు - అడ్డం:** 1. శ్రీశైలము, 3 ఆలోచన, 5. అరుణోదయమువ. 6. చున్నాడి, 7. కులుకు బాగా, 9. సరిసమము, 10. భీముడు, 12. ముగ్గురు 13. ముదికున్కాలు, 14. వుహూరా.

**నిలువు:** 1. శ్రీరంగము, 2. ముదురు, 3. ఆముదములు, 4. నవీనముగా, 5. అడియాసలుబోకు, 7. కుముదములు, 8 బాల్యము, 9. సమాజము, 10. భీరువు, 11. దుమురా.

**విజేతలు:** రెండవ బహుమతి: వై. శశిభూషణ్ కుమార్, విజయవాడ; మూడవ బహుమతి: ఎస్. వెంకటరెడ్డి, కవిటం, (ప. గో. జిల్లా).

**తెలివికి పరీక్ష-జవాబులు:** 1. అర్జునుడు శ్రీకృష్ణునితో చెప్పాడు. కర్మముకంటే జ్ఞానమే శ్రేష్ఠమని చెప్పి, హింసాత్మకమైన కర్మము యుద్ధము చేయమని శ్రీకృష్ణుడు చెప్పినప్పుడు, 2. అనుభవం, 3. 'మా తెలుగు తల్లికి మల్లెపూదండ' పాట వ్రాసిన శంకరంబాడి సుందరాచారి. గాంధీ మహాత్ముని మీద, 4. చల్లకు వచ్చి ముంత దాచుట, 5. 5, 1, 6. $31 \times 2 = 62$, $62 + 1 = 63$, 7. 350 (బ్రాకెట్టుకు రెండు ప్రక్కలా ఉన్న నంబర్లను కలిపి 2 చే భాగించు); 8. (ఎ) కడుపుకుక్కురుతి, (బి) కడుపులోచల్ల కదలకుండా, (సి) కడుపుకొట్టు, (డి) కడుపులో పెట్టుకొను.

**విజేతలు**-రెండవ బహుమతి: జి. డి. సన్యాసమ్మ కళింగపట్టణం; మూడవ బహుమతి: ఎస్. బి. ప్రసాద్, నకిరికల్.

**మాటల మహిమ - జవాబులు.** 1. సేవ (ఎ), ఆస్థానము (బి), సభా మందిరము (సి); 2. కఠినము (ఎ), గాఢము (బి), మొండితనము (సి); 3. బాధ (సి), పీడ (డి); 4. తళతళ ప్రకాశించు (ఎ), గొణుగుకొను (బి), కిరణము (సి) పుష్టై (డి); 5. ఉపశాఖ (సి), రెమ్మ

"కొత్తగా కలిగిన సుఖాలు కొత్త బాధలను తెస్తాయి."

(డి); 6. వంచన (ఎ), పొరపాటు (బి), అసత్యము (సి), అజ్ఞానము (డి); 7. ఎగయు (ఎ), చెలరేగు (బి), పైకివచ్చు (సి), అగ్రహించు (డి); 8. బలము (ఎ), సామర్థ్యము (బి), ధైర్యము (సి), సాహసము (డి).

విజేతలు - మొదటి బహుమతి: భల్లం సూర్యనారాయణరాజు, లంకల కోడేరు, (ప. గో. జిల్లా); రెండవ బహుమతి: ఎన్. రూప్పీలక్ష్మి, హైదరాబాద్.

ముఖచిత్రవ్యాఖ్య - మొదటి బహుమతి: కె. శ్రీరాములు, అమడగూరు, (అనంతపురం జిల్లా); రెండవ బహుమతి: భమిడిపాటి అప్పల నరసింహులు, నరసన్నపేట (శ్రీకాకుళం జిల్లా); మూడవ బహుమతి: వై. మంజులాదేవి, కడప.

పాఠకుల అభిప్రాయాలు - రెండవ బహుమతి: గొడవర్తి శీలారాణి, చీరాల; మూడవ బహుమతి; పట్నాయకుని మోహన్ దాస్, కొత్తూరు, (శ్రీకాకుళం జిల్లా).

మీరైతే ? - మొదటి బహుమతి: సోనాపురం మధుసూధనరావు, వసుంధర పోస్టు, (శ్రీకాకుళం జిల్లా); రెండవ బహుమతి: కె. శ్రీరాములు, అమడగూరు, (అనంతపురం జిల్లా).

భావపరిచయపోటీ - మొదటి బహుమతి: కట్టోజు రఘురామ్, అజ్జరం, (ప.గో. జిల్లా); రెండవ బహుమతి: జి. గురునాధబాబు, అదోని, (కర్నూలు జిల్లా); మూడవ బహుమతి: ఎన్. కళ్యాణ్ సుందర్, గుంటూరు.

( 41 వ పేజీ తరువాయి)

రకాన్నిబట్టి జామకాయల ఆకారం, ప్రమాణం, రంగు, సువాసన మారుతుంటాయి. జామ అన్ని ఉష్ణ ప్రదేశాలలో బాగా పెరుగుతుంది. భారతదేశంలో ముఖ్యంగా ఉత్తరప్రదేశ్, బీహార్, పంజాబ్, మహారాష్ట్ర, ఆంధ్రప్రదేశ్‌లలో బాగా పండుతాయి. ఉత్తర ప్రదేశ్‌లలో పండించే 'అలహాబాద్ సఫేద్', 'లక్నో 49' రకాలు చాలా ప్రసిద్ధమైనవి.

జామ బాగా పలకబారి పండినప్పుడు చాలా రుచిగా వుంటుంది. పుష్టిని ఇస్తుంది. ప్రోటీనులు, కార్బోహైడ్రేటులు, క్రొవ్వు పదార్థాలు, ఇనుము, భాస్వరం, కాల్షియం, ఇతర ఖనిజాలు జామపండులో బాగా లభిస్తాయి.

భారతదేశంలో చాలా చోట్ల దీన్ని అమ్రూద్ (Amrood) అని పిలుస్తారు. విరేచనకారి. దోరగా ఉండే పచ్చకాయలు, పండ్లు తింటారు. గువాజెల్లీ అని జామపండ్లతో జెల్లీ తయారుచేసుకుంటారు. జామ్, ఊరగాయలు కూడా చేసుకుంటారు. వీటినుంచి తయారుచేసిన రసం మంచి పానీయంగా ఉపయోగిస్తారు. అమెరికా మరియు వెస్ట్ ఇండీస్‌లలో 'గువాపేస్టు', 'గువాచీస్' చాలా ప్రసిద్ధి.

ఇది చౌకగా లభిస్తుంది కాబట్టి సాధారణంగా అందరూ ఉపయోగించవచ్చు. ఎక్కువగా ప్రొటీనులు, విటమినులు దీనిలో లభించడం వల్ల ఇది శరీరానికి మంచి ఆరోగ్యకరం.

"గుడ్లగూబ పగటివెలుగును చూడజాలదు, కాకి రేచీకటిని చూడజాలదు.
కాని కామాందుడు రేపగళ్ళను రెంటినీ చూడలేడు."